# కస్తూరిబాయి - శారదాదేవి

గీ॥ మూఁడులోకమ్ము లేలెడు మోహనుఁడవు,
గుణములు తోఁపనికి ఒప్పుకొంటివా
భక్తజనరక్షణార్థ మేపనికి నైన
చేయ కుప్పించి సాహసి-చెదవు కృష్ణ.

గ్రంథకర్త :

విన్నకోట వేంకటరత్న శర్మ

*LECTURER ON*

GEETA - BIBLE - KORAN AND
UPANISHADS

*AND READER OF*

LORD GOURANG
RAMAKRISHNAPARAMAHAMSA
VIVEKANANDA
TYAGARAJU & OTHERS

And Lover of Art, Fun and Phylosophy

గీతా ప్రచురణాలయము,
దుర్గాఅగ్రహారము - బెజవాడ.

వెల 1—0—0

# పీఠిక

భారతదేశములో పురుషులు స్త్రీలకు తగిన స్థానమిచ్చినట్లు లేదు. కారణము లనేకములు. ఆర్థికము, సాంఘికము మొదలైనవి. అందువలన పురుషజాతి నానాకష్టములపాలగుచున్నది. ఇప్పటికైనను ఈజాతి మేల్కొనినట్లు కన్పడదు. ఇటు కన్న తలిదండ్రులకును, అటు చేపట్టు భర్తకును, అత్తమామలకును, కూడ స్త్రీలవిషయమై శ్రద్ధకలుగుటలేదు. వినయము, వివేకము, తెలివి, జ్ఞానము, చదువు, దేహదార్ఢ్యము, మనోదార్ఢ్యము, ఇవన్నియు స్త్రీలకక్కరలేదనువారెందైన గలరా ?

రామకృష్ణుడు శారదాదేవికి, చిన్నవిషయము మొదలు పెద్దవిషయమగు సమాధి పర్యంతము నేర్పెను.

కస్తూరిబాయికి గాంధీ, తన సహచర్య లాభముచే, దేశసేవా మహాభాగ్యము చేకూర్చెను. ఏ కుటుంబమునగాని చూడుడు. ఎంతకాలము వ్యర్థముగా, గాబడుచున్నదో ?

ఆ కాలమంతయు స్త్రీలచే వినియోగింపబడినచో, కుటుంబ దారిద్ర్యము దేశదారిద్ర్యము తొలగిపోవుననుటలో సందేహమేమి ? వారిని నడిపించుటకు పురుషులు తగిన బుద్ధి సంపాదించుకొనవలయును. ఈరెండు చరిత్రలును స్త్రీలకేగాక పురుషులకు కూడ మార్గదర్శకములని చదువరులు తెలిసికొనగలరు.

ఓం తత్సత్.

భారతదేశ నారీమణులలో తత్త్వవేత్తలు, రాజకీయ వేత్తలు, దేశసేవాధురీణలు, పాతివ్రత్యాభిమానులు, ప్రేమైక మూర్తులు, గుణగ్రహణ పారీణలు, వేనకువేలుగా గలరు. యే మతమునందేమి యే కులమునందేమి, యే కాలము నందేమి యే దేశమునందేమి; యిట్టివారుండుటలో సందేహ మేమియు లేదు. అట్టి వారి కొక భాషతో సంబంధము లేదు యీ తరగతివారే యితరులకు మార్గదర్శకులై, యితరుల ప్రేమకు పాత్రులై, యితరులకాదరణీయులై వారి శరీరము నందలి ప్రతిరక్త అణువును బ్రహ్మజ్ఞానముచే పూరించి దేశసేవ యందే తన్మయు లగుచుందురు. వారొక పలుకుచేగాని, చూపుచేగాని, స్పర్శచేగాని, సంకల్పముచేగాని, యినుము వంటి కఠినహృదయులను కరగింపగలరు. పాషాణమును చైతన్య పూరితముగా చేయగలరు. ఇట్టివారు వేదకాలమునందే గాక యీనాడును గలరనుటకు శ్రీరామకృష్ణ పరమహంసగారి భార్య శారదాదేవియు, మహాసాధకుడగు శ్రీ గాంధీగారి భార్య కస్తూరీబాయియు సాక్ష్యముగాదా? వారి చరిత్రము సమగ్రముగా మనము తెలిసికొన వలదా.

ఇట్టివారు ఆంతరంగికముగాకూడా కొందరుండవచ్చును ప్రకాశమునకు వచ్చిన వారుగూడా వారికి ప్రకాశింపవలెనను భావ ముండియుండదు. ఆంతరంగికమున జ్ఞానయోగులయ్యును, లోకమునకు కర్మయోగులుగనే తోచబడుదురు. మనము యే మహనీయురాండ్ర చరిత్రలు యిప్పు డెత్తికొంటిమో వారిలో

శ్రీశారదాదేవి అజన్మ అస్ఖలిత బ్రహ్మచారిణి. శ్రీమతి కస్తూరీ బాయి నగవు వయస్సునుండీ బ్రహ్మచర్య లాభమును పొందినది. పూర్ణ బ్రహ్మచారుల యదృష్ట మేమనవచ్చును ? భీష్మాచార్యులు, వివేకానందస్వామి మొదలైన వారెందరో ఊర్ధ్వరేతస్కులై బ్రహ్మానంద రసార్ణవ మగ్నులై కృష్ణప్రభు ప్రేమకు పాత్రులయిరి మహాత్ముడును "మనోనిగ్రహ" మను గ్రంధములో తనవిషయమై యిట్లు చెప్పియున్నాడు. ("A broken mirror is a broken mirror") "పగిలిన అద్దము పగిలిన అద్దమే." అతుకు పెట్టినను పూర్వపుశోభ రాదుగదా. ఆయన బ్రహ్మచర్యము నగవు వయస్సునుంచి గావున ఆయన అట్లు నుడివియున్నారు. పూర్ణ బ్రహ్మచర్య లాభమును పొందనందులకు ఆయన విచారమును సూచించియున్నారు.

ఆయన సాంగత్యమువల్ల కస్తూరీబాయియు, రామకృష్ణుని సాంగత్యమువలన శారదామాయియు, చిత్తశుద్ధి గలవారై భక్తిసోపానము లెక్కి- తమ భర్తలయందే దైవమును జూచి ఆ దైవస్వరూపమే లోకమని, అటు పతిసేవ, యిటు లోకసేవ చేసి స్త్రీలకు మార్గదర్శకులైరి. అహా! భారతదేశ భాగ్యము! తమ భార్యలనుగూడ తమంత వారుగాజేసి, తమ పేరెట్లు శాశ్వతముగా జేసికొనిరో, అట్లే తమ భార్యల పేర్లను శాశ్వతమగునట్లు జేసిరి. స్వర్గసౌధ కవాటములందును వారిపేర్లు సువర్ణాక్షరములతో లిఖింపబడవా ? సామాన్యముగ పురుషుడు తన ముక్తిని తాను సాధించుకొనుటలోనే తృప్తిబడుచున్నాడు కాని, మహాత్ములట్లు తృప్తిబడలేదు. తమ సహచర్యలాభమున

తమ్ముననమ్మిన, తమ అర్ధాంగలక్ష్ములనేమి, తమ సేవకులనేమి తమ యిరుగుపొరుగు వారలనేమి, వారికిని యుద్ధరణ గలుగు వరకు వీరు తృప్తిబడలేదు. వివాహయుగములో జొరబడిన ప్రతి యువకుడును యీ విషయమును మరువకుండుగాక!

1869 సంవత్సరము పోర్ బందరను గ్రామములో కస్తూరీ బాయి, గాంధి, యిరువురునుజననమందిరి. ఏప్రియల్ నెలలో కస్తూరీ బాయియు, అక్టోబర్ నెలలో గాంధీమహాత్ముడును, ఆరునెల లించుమించుగా పుట్టుటచే వారు సమానముగనే పెరుగుచుం డిరి. కస్తూరీబాయి తండ్రి పేరు గోకుల్ దాస్ మెకాన్ జీ. ఆయన గొప్పవర్తకుడు. గాంధిగారి తండ్రి పేరు కరంచంద్, ఈయన పోరుబందరులో దివానుద్యోగములోనుండెను. ఈయనకు కాబాగాంధియని కూడ పేరుగలదు. యీ పెద్దలిరువురును, యీడుజోడుగా పెరుగుచున్న ఆ చిన్నబిడ్డలిరువురకును పెండ్లిజేసి వారి ముద్దు ముచ్చటలను, అపుడే చూచుకొనవల యునని గంపెడాశతో నువ్విళ్ళూరుచుండిరి. 1876లో, వారికేడవ వయస్సునందే వారు భార్యాభర్తలైనట్లు ప్రధాన మహోత్సవము జరిపిరి, మంత్రపూరితమగు, వివాహము వారికి 1882 సంవత్సరములో జరిగినది, యీ వైవాహికోత్సవము, సంసారబంధమని వారకు లూహించుకొనియే యుందురు. యెట్లైనను ప్రేమబంధ మూహించుకొనదగిన వయస్సుగాదు, ఇవి సనాతన కుటుంబములు. కస్తూరిబాయి యేనాడును బడికిపోయి యెరుగదు, అక్షరజ్ఞానము లేదు. కావున వివాహము నాటికి యేమియు దెలియని గోల, బేల, మహాత్ముని దగ్గరకు

వచ్చినవెనుక ఆమెకు విద్య బోధింపవలయునను ఆశ ఆయనకు గలిగెను. కాని,ఆయన మోహదృష్టి,ఆయనకామదృష్టి, ఆయన బోధల కడ్డువచ్చెను. నూత్నదంపతుల కాలమంతయు,ముద్దుల దొంతరలలోను, ఆలింగనాది భాగ్యడోలికలలోను, శృంగార రససముద్రమునం దీదులాడుటలోను, గడచుచుండ, విద్యనేర్పుట కాయనకు సమయమెక్కడ? నేర్చుకొనుట కామెకు వ్యవధి యెక్కడ? సనాతనాచార ప్రకారము వారిరువురు తల్లిదండ్రుల యెదుటగాని, పెద్దల యెదుటగాని, కలసి తిరుగరాదు. ఇంక వారు కలసికొనునది, రాత్రిసమయమునందు పడక గది లోనే. ఏ రాత్రి పదిగంటలకో, పడకగదిలో చేరిన పడుచుపిల్ల విద్యకోరునా? కథియవాడులో, అప్పటికీ యిప్పటికీ పరదా పద్ధతి (ఘోషా) కలదు. ఈ కారణముల వలన కస్తూరీ బాయికి చదువురాలేదు. తన భార్యను విద్యావతిగా చేయ వలెననియు, స్త్రీవిద్య దేశమున కవసరమనియు, ఆయనకు తోచిన నాటికి, ఆయన దేశసేవా వ్యాపారమున మునిగి యుండెను. అప్పుడు బోధించుటకు సమయమెక్కడ? ఇతరుల చేత చెప్పించుటకు వీలెక్కడ?

చాల కష్టముమీద గుజరాతీ అక్షరములు వ్రాయుట, సులభమగు గుజరాతీభాష అర్థము జేసికొనుట మాత్రము ఆమెకు వచ్చెను. ఆయన ఆమెను, ప్రేమదృష్టితో తిలకించి యెక్కువ చనువీయక, తాను కామమోహితుడుగాక, పట్టుదలగా నుండినచో, యీ నా డామె, గొప్ప విద్యావతిగా తయారై యుండును. యేకారణమైననేమి, భారత దేశ స్త్రీలలో విద్య చాల తక్కువగా నున్నది.

ప్రతియువకునికిని, చదువుకొన్న భార్య గావలెనని ఆశ యున్నది. తన చెల్లెలివిద్యావిషయమై మాత్రము రోూచించడు. సభలలో స్త్రీవిద్య అవసరమని బల్లలు వగులగొట్టువారెందరో, తమ భార్యలవిద్యకై రోజునకొకయరగంటయైనను కర్చుబెట్టరు. స్త్రీ, విద్యావతియైనచో యొకరి సహాయము లేకయే, తన పిల్లలకు విద్య నేర్పుకొనగలదు. స్త్రీ విద్యావతియైనచో శుద్ధమొద్దు స్వరూపమగు భర్తనుగూడ విద్యావంతునిగా జేసికొనగలదు. మంచి గ్రంథములలో గల విషయములు, తాను జీర్ణింప జేసికొని, తన వీధిలోగల యితర నారీమణులకుగాని, తనయింటిలో గల ఆడుబిడ్డలకు నత్తలకుగాని, చెల్లెండ్రకుగాని, తాను నేర్చిన విషయములు బోధించగలదు. స్త్రీవిద్య యని చెప్పుటలో యేదియో యొక భాషలో నుత్తీర్ణురాలగుట యని మా భావముగాదు. జ్ఞానవంతురాలు, గావలయుననియే మాభావము. వివేకానందస్వామివారిట్లు జెప్పియున్నారు.

"నా భారతదేశ నారీమణులకు ఖ్యాతిదెచ్చినది వారి సత్ప్రవర్తన. వారి నిరాడంబర జీవితము. వారి పతిభక్తి, వారి ప్రేమహృదయములు. ఇవి గలిగిన మీాదట విద్యయున్నచో, నే సంతోషింతును. వీనిని వదలి వారెట్టి డిగ్రీలుపొందినను, నే మెచ్చను."

సావిత్రి, చంద్రమతి, దమయంతి మొదలైన భారత నారీమణులు, వారెంత నేర్చిరో తెలియదుగాని, వారి సౌశీల్యమే వారికి ప్రఖ్యాతి దెచ్చెను. శారదాదేవియు గొప్ప విద్యావతి గాదు, అయినను ఆమెకుఖ్యాతిదెచ్చినది ఆమెభర్తృ శుశ్రూషా

వ్రతమే. అన్ని విషయములకంటెను సత్ప్రవర్తనమే మానవలోక మునకు ముఖ్యము. శ్రీకృష్ణభగవానులు భగవద్గీతా శాస్త్రములో, రెండవ అధ్యాయమున సాంఖ్యయోగమును, నాల్గవ అధ్యాయమున జ్ఞానయోగమును, పండ్రెండవ అధ్యాయమున భక్తి యోగమును, పదునేనవ అధ్యాయమున పురుషోత్తమ ప్రాప్తి యోగమును జెప్పి, యీ యోగములు సిద్ధించుటకై పునాది ప్రాయములగు, చివర పదునారు పదునేడవ యధ్యాయము లను చెప్పియున్నారు. ఈ రెండధ్యాయములలో చెప్పబడిన సత్ప్రవర్తన మానవునకు లేనిచో పూర్వము జెప్పబడిన యోగ ములు సిద్ధింపవని భగవానుని యభిప్రాయము. మా యభి ప్రాయము అంతియే. సత్ప్రవర్తన లేకపోవుట చేతనే అనేక వేలలో యెవడో నొకడే సిద్ధిబొందుచున్నాడు. కొందరు వేదాం తులు తమ శిష్యులకు జేయు బోధలలో, కొందరు గురువు లుపాసకులకు జేయు నుపదేశములలో సత్ప్రవర్తనకు ప్రాధాన్య మిచ్చుటలేదు. కావుననే, చిల్లికుండలో పాలవలె, వారి సాధన లన్నియు వ్యర్థములగుచున్నవి. గాంధీమహాత్ముడును సత్ప్రవర్త నకే ప్రాధాన్యమిచ్చుచున్నాడు. కస్తూరీబాయియొక్క గొప్ప దనమును, శారదామణియొక్క శ్రేష్ఠత్వమును, వారి సత్ప్ర వర్తనమునందే యిమిడియున్నవి.

తన విధిప్రకారము, కస్తూరీబాయి ప్రవర్తించుచున్నను, మహాత్ముడు, ఆమెపై అధికారమును చెలాయించుటకు, ప్రారం భించెను. ఆయన యుత్తరవు లేనిదే ఆమె యెచ్చటకు పో గూడదనియు, తన యిష్టము లేనిదే, ఆమె యే ప్రసక్తియు

చేయకూడదనియు, ఆయన స్థూల సూక్ష్మకారణ శరీరము లన్నియు, తన స్వాధీనములే యనియు తలంచెను. ఇక దంపతుల మధ్య కయ్యము లంకురింపవా? ఈ అధికార ప్రాబల్యమువలన, ఆయమకు గృహమే కారాగారమాయెను. దీనిని ఆయమ యెట్లు భరించగలదు? ఆయమయయే గాదు, యిటువంటి భర్తతో కాపురము జేయ నెట్టి స్త్రీకి సాధ్యమగును? చాలమంది పురుషుల కిదియే అభిప్రాయము :— తామే మగవారమనియు, తామధికారమును చలాయించు వారమనియు, స్త్రీలు తమ కంటె తక్కువనియు, చిన్నవిషయముగాని, పెద్ద విషయముగాని, న్యాయముగాని, అన్యాయముగాని; తాము చెప్పినట్లే స్త్రీలు నడచుకొనవలయుననియు- అట్లు నడువజాలని వనిత, అవిధేయురాలని తలంతురు. వీరి కెన్ని హక్కులున్నవో అన్ని హక్కులును భర్తలపై భార్యలకు లేవా? ఎట్టివాడైనను భార్యను సుఖపెట్టవలయునేగాని, భార్యను నిర్బంధింపవచ్చునా? క్రమముగా వారి నెయ్యంబులు కయ్యంబులయ్యెను. క్రోధావేశపూరితులై యుండుటచే వారిలో వారు మాట్లాడుటయు కఱవయ్యెను. వారిరువురిమధ్య రోసరోసలు విసవిసలు ప్రారంభమాయెను.

తుదకు కస్తూరీబాయి ఆయన ఆజ్ఞలనుమీరి, స్నేహితులను చూచుటకో, స్వామిదర్శనమునకై కోవెలకో పట్టుదలకైనను ఆయనతో చెప్పకయే పోవుచుండెను. ఆ వయస్సులో మహాత్ముడు, భార్యాభర్తల సంబంధములు

గుర్తించలేదు. విజ్ఞానము హెచ్చినకొలది, లోకానుభవము కలిగినకొలది, తుదకు తనభార్యను తల్లివలె చూచుకొను సంతస్థితికి తాను వచ్చెను. ఎట్లున్నను ఆయమపై మహాత్మునకు మోహాభావము పోలేదు. పదుమూడవ సంవత్సరమున వారికి వివాహమాయెను. పదునెనిమిదవ సంవత్సరమువరకు, అనగా పెండ్లియయిన అయిదు సంవత్సరములలో దాదాపు మూడుసంవత్సరములు కస్తూరీబాయి తన పుట్టింటనే కాలము గడిపెను. తల్లిదండ్రులు తమ కుమార్తెపై గల ప్రేమచే, కుమార్తె లెక్కువకాలము పుట్టింటనేయుండవలెనని తలంతురు. కాపుర మెట్లు మారునోయను చింత వారికుండదు. కస్తూరీబాయికి మాటిమాటికి తమ పుట్టింటినుండి పిలుపువచ్చుచుండెను. అందువలన నా దంపతులకు, సంయోగమునకన్న వియోగమే ఎక్కువ అనుభవములోనుండెను. ఆయన లండను పత్తనమునకు పోవుచుండుటచే వియోగాభ్యాస మాయనకు లాభించెను.

1887 వ సంవత్సరములో గాంధీ మెట్రుక్యులేషన్ పరీక్షలో నుత్తీర్ణుడాయెను. పదునెనిమిదివందల యెనుబదియెనిమిదవ సంవత్సరములో వారికి ప్రథమ శిశువుద్భవించెను. బారిష్టర్ పరీక్ష జదువుటకు 1888 లో గాంధీ లండనుకు వెళ్ళెను. ఆయన యింటియందు లేనికాలమున, ఆయమ తన శిశువుతో రాజకోటలో తన మామగారివద్ద నుండెను.

1891 వ సంవత్సరములో ఆయన లండనునుంచి తిరిగి వచ్చి కొన్నాళ్ళు రాజకోటలో, తదుపరి బొంబాయిలో, న్యాయవాదియై యుండెను. ఆ వృత్తిలోన ఆయనకు ప్రకా

కము తక్కువాయెను. బాగుగా శోభించగల సూచనలును కాన్పించలేదు. భార్యనుగురించిన యభిప్రాయములు, ననుమాన ములును పోలేదు. విద్యావతిగా ఆమెను చేయవలెనను ఆశ గలదుగాని, తన మోహామింకను అడ్డువచ్చుచుండెను. ఈయ నతో వేగుట కస్తూరీబాయికి బాధాకరముగనే యుండెను. కోపావేశముచే నామెను పుట్టినింటికి తరిమివైచెను. ఆమెకు బుద్ధివచ్చిన వెనుక పిలిపించవచ్చునని తలంచెను. తరువాత కొన్నాళ్ళకు తప్పంతయు తనదేనని గ్రహించెను.

## దక్షిణాఫ్రికా నివాసము

వివాహవిషయమునకూడ:— అప్పటికి జ్ఞానములేని కారణమున, మంచివస్త్రములు ధరింపవచ్చుననియు, మేళతాళ ములతో జోరుగా నుండవచ్చుననియు, దివ్యభోజన ఫలహార ములు లభించుననియు, తనతో ఆడుకొనుటకు, యెప్పుడును తనతో కూడనుండుటకు నొకపిల్లకూడ దొరకుననియు, తలచియుండుటచే బాల్యమున బాల్యవివాహ మంగీకరించెను, వివాహమునందలి గంభీరభావ మర్థమైననాడు, తనకు బాల్య మున వివాహముచేసినందుకు తండ్రి నెంతయో నిందించెను. మదరాసులో నొక వివాహమున కాహ్వానింపబడినప్పుడు యీ గ్రంథకర్త వివాహధర్మములగూర్చి వధూవరులకు కొన్ని పద్యరత్నము లర్పించెను. అందొకటి పాఠకులకై యిచ్చట నీయబడియున్నది.

గీ. కేవల శరీర సుఖమునకే, కళత్ర
మను మృషావాక్య తలపోయ కాత్మలోన
సంఘ సేవార్థమని క్షణక్షణము దలచి
బ్రతుకు డీకమీద పుణ్యదంపతులు మీరు.

అంత చిన్న వయస్సున పెండ్లియాడుటకు, ఆయనకూడ యుబలాటపడియేయుండెను. బొంబాయినుంచి రాజకోటకు, మరల న్యాయవాది వృత్తిజేయుటకై వెడలెను. ఇంతలో దక్షిణాఫ్రికానుండి ధనవంతుడగు నొక మహమ్మదీయ సోదరుని దగ్గరనుండి ఆహ్వానము వచ్చెను. కచ్చేరీలో వారి తరఫున యొక దావాలో గాంధీగారిని, వాదించుటకై యేర్పాటుజేసి కొనిరి, ప్రధమమున ఆయ నొక్కడే పోయియుండెను. అక్కడ తన విధి తానుజేయుచు తెల్లవారిచే బాధలు పెట్టబడుచుండిన హిందువుల పక్షమవలంబించి, దేశసేవకై కష్టములు బడ నారంభించెను. రెండవ పర్యాయము దక్షిణాఫ్రికానుండి మరల నాహ్వానము వచ్చినపుడు కస్తూరిబాయితోను, తన బిడ్డలతోనూ ప్రయాణమాయెను. ఇపుడు దక్షిణాఫ్రికాలో వారు 9 సంవత్సరములుండిరి. ఈ 9 సంవత్సరములలో తన భర్తతోబాటు తానును, విపరీత కష్టములకు లోనై సత్యాన్వేషణపరురాలై, ఆయనకు కుడిభుజముగా పనిజేసెను. అచ్చటి హిందువుల తరఫున బని చేయుటచే, తెల్లవారికి ఆయనయేగాక, ఆయన కుటుంబమంతయు విరోధ ప్రాయమయ్యెను. ఆనాడు కురుక్షేత్రమందు ధర్మయుద్ధము జరిగెను. దక్షిణాఫ్రికాలో మహాత్ముడు ధర్మయుద్ధ మొనర్చెను. ఆ యుద్ధమునందాయమయు పాల్గొ

నుటచే నిజముగా సహధర్మచారిణి యయ్యెను. అక్కడ నున్న హిందువులలో పార్సీవారే నవనాగరికులని పేరు వడసిరి. తెల్లవారి పద్ధతులు గాంధీగారి కిష్టములేదు. వస్త్రధారణము నందేమి, గృహభార నిర్వహణమునందేమి, పద్ధతులయందేమి, గాంధీగారు తమకుటుంబమును పార్సీవారి ననుగమింపజేసెను. కాళ్ళకు చెప్పులు తొడిగికొనుట తన భార్యకు పిల్లలకు అభ్యాసములేదు. ఈయన వాని నమలులో బెట్టించెను. పిల్లలకు మేజోళ్ళు చెమట గలిగించెను. కస్తూరీబాయి పాదములకు కాలిజోడు బాధ గలిగించెను. అట్లున్నను గాంధీగారి సమాధాన వాక్యములచే, వారందుల కంగీకరించియే బాధ ననుభవించుచుండిరి. భోజనముదగ్గర కత్తులు యినుపముళ్లు వారి కభ్యాసమాయెను. కాని ఆ నాగరికతపై ఆయనకు రోతబుట్టి నప్పుడు వీని కన్నిటికి స్వస్తి జెప్పించెను.

## సమదర్శనము

దర్బానులో గాంధీగారున్నపుడు ఆయన కచ్చేరీ గుమాస్తాలు ఆయనదగ్గరనే తరచుగా నుండిరి. అందులో క్రైస్తవులు హిందువులు గూడ గలరు. వారిని ఆయన యేకకుటుంబము వారివలెనే భావించుచుండెను. అట్లాయన భావించుటలో కస్తూరీబాయి అడ్డము వచ్చినపుడెల్ల ఆయన చిరాకు బడుచుండెను. ఆ గుమాస్తాలలో నొకడు పంచమదంపతుల కుమారుడేగాని క్రైస్తవమత మవలంబించెను. వారు నివసించు గృహము పాశ్చాత్య నాగరికతా పద్ధతులపై నిర్మించబడుటచే ఆ గదు

లలోనుండి మురికి నీరు బోవుటకు దారులులేవు. ఆ యా గదు
లలో కుండలు మాత్రము పెట్టబడియుండెను. గుమాస్తాలు
అచ్చటనే తరచుగా నుండుటచే వారి వారి గదులలోని కుండ
లను వారే శుభ్రమొనర్చుకొనుచుండిరి. క్రొత్తగా వచ్చిన
యీ పంచమదంపతులకు బుట్టిన క్రైస్తవ సోదరునకు పద్ధ
తులు తెలియకుండుటచే, అతని కుండ శుభ్రము జేసికొనుట
అతనికి దెలియదయ్యెను. ఒక్కొక్కప్పు డందరునూ ఆ విష
యమై మరచినప్పుడు, గాంధీగారి కుటుంబమే ఆ కుండలను
శుభ్రపరచుచుండెను, ఇతరుల కుండలను తీయుటలో కస్తూరీ
బాయికి సంశయము లేదుగానీ, ఆ హరిజన సోదరుని కుండలను
దీయుటకు మాత్రము ఆమె అంగీకరించలేదు. గాంధీగారు తన
అధికార ముపయోగించును. విధిలేక ఆమె తీయవలసివచ్చి
నప్పుడు, ఆమె కన్నులెఱ్ఱబడును. ఆగ్రహావేశపరురాలగును.
దుఃఖాశ్రువులు కన్నులవెంట రాల్చును, ఆ స్థితిలో గాంధీగారి
నెంతయో కఠినముగ పల్కును. ఆ చేయు పనిని సంతోషముగా
తృప్తిగా జేయవలసినదని గాంధీగారు జెప్పుచుందురు. ఇట్టి
పరిస్థితిలో యొక సమయమున గాంధీగారు ఆమెను జూచి,
"ఇకముందిట్లు జరిగినచో నేను భరించలేను, మరియు సహించ
లేను జాగ్రత," అని పల్కెను.

ఆ పల్కులామె చెవులకు ములుకులై దోచుటచే
హృదయమున బాణము గ్రుచ్చుకొనినట్లై, గొంతెత్తి బిగ్గ
రగా "అట్లైన నీ యింటి సమాచారము నీవే చూచుకొనుము,
నన్ను పోనిమ్మని బల్కెను." ఆ సమయమున గాంధీగారి

హృదయమున నున్న కరుణారస మారిపోయెను. ఆమె హస్తమును గట్టిగా పట్టుకొనెను. ఇంటి ద్వారబంధమువరకు కామె నీడ్చెను. బైటకు నెట్టుటకు ద్వారము తెరిచెను. ఆమె కన్నుల వెంట అశ్రుధారలు కాల్వలై పారజొచ్చెను. దీనవదను రాలయ్యెను.

ఆ అసహాయ స్థితిలో దిక్కుమొక్కును లేక, ఆర్చువారు తీర్చువారును లేక యేడ్చుచు "నీకు సిగ్గుగ్గులు లేవా? మర్యాద పోనాడితివా? నిన్ను నీవే మరచినట్లున్నావే? నన్నెక్కడికి పొమ్మందువు? నే నెక్కడికి పోదును? నాకిచ్చట నాయను వారెవరున్నారు? తల్లిదండ్రులు లేరు. అన్నదమ్ములు లేరు; బంధువులు లేరు నన్నెవ్వరు వెనుకవేసుకొని వత్తురు? మీకు భార్యనైనంతమాత్రమున మీరుతన్నినను, తిట్టినను పడుచుండవలయునా? సరిగా ప్రవర్తించండి. తలుపుమూయుండి. ఇట్లు మనము చేయుచుండగా యెవరైననూ చూచి నవ్వరా? మీకుపుణ్యముండును·బుద్ధితెచ్చుకొనుడుఅని భర్తనుజూచి బిగ్గరగా అరచెను. గాంధీగారపుడు ధైర్యముతో నిలచిరిగాని నిజముగాసిగ్గుపడి తలుపును మూసెను. ఆయన అ సమయమున నట్లు జేసెనేగాని భార్యావ్యామోహాము పోలేదు. భర్తచే యెన్నిమార్లవమానబడినను ఆమెకును ఆయనపై వ్యామోహాము పోలేదు. కావున వారెన్నిమాఱులు యిట్టి తగాదాలు బడుచున్నను, చివరకు యేదోవిధముగా రాజీ బడుచుండిరి. తుదకు శాంతమునే వహించుచుండిరి. కస్తూరీబాయి పొందుచున్న ఓర్పు చెప్పుట కలవిగాదు. ఆ యోర్పువలన నామె దే

పైచేయిగా నుండెను. ఈ నాడా దంపతు లట్లు లేరు ఆనాటి పరిస్థితులనుంచి వారీనాడు బయట బడగలిగిరి. ఆయనకిప్పుడు గ్రుడ్డిమోహము లేదు. బోధకునివలె ఆమెపై అధికారము చలాయించవలెనను ఆశయును లేదు. పూర్వము ఆమెయందు అసంతృప్తిగా ఆయన యెట్లు ప్రవర్తించెనో యిప్పుడామె, ఆయనయందు అట్లే ప్రవర్తించినను, ఆమె కట్టి హక్కు గలదని యీనాడు గుర్తించెను. అనేక అనుభవముల యనంతరము వారిప్పుడు ప్రాణస్నేహితులని గుర్తించుకొనిరి. మోహము లంతరించెను. ఆయనకు జబ్బుచేసినప్పుడెల్ల ఆమె విశ్వాసము గల నర్సువలెనే ప్రతిఫలాపేక్ష లేక సేవించుచుండెను. 1898 సం॥ వరకును వారికి బ్రహ్మచర్యమునం దభిరుచి గలుగలేదు. భార్య భర్తకు భోగ్యవస్తువనియు, భర్తచేతిలో యొక నౌకరనియు గాంధీగా రంతవరకు తలంచిరి. 1900 సం॥ లగాయతు భార్య సహధర్మచారిణియనియు, అర్థాంగియనియు, ధర్మపత్నియనియు సహాయకురాలనియు, కష్టసుఖములలో పాల్గొనవలసిన అధికారిణియనియు, ప్రాణస్నేహితురాలనియు గ్రహించెను. ఈ భావములు 1906 సం॥నుండియు సరిగా నమలులో పెట్టబడెను. యీ విషయమై గాంధీగారిట్లు పలికియుండిరి. "నా భార్యయందు కామదృష్టియు, మోహదృష్టియు, పశువాంఛా దృష్టియు, క్రమముగా తగ్గినకొలది నా గృహజీవితము అంతకంతకు శాంతియుతమయ్యెను. మధురమయ్యెను. సుఖవంతమయ్యెను." దక్షిణాఫ్రికాలో వారి గృహకృత్యములలో

జరిగిన యొక విషయమును మనము ముఖ్యముగా తెలిసికొన వలసి యున్నది.

దక్షిణాఫ్రికానుండి గాంధీ దంపతులు హిందూదేశమునకు వచ్చు సమయమున నేటాలు పట్టణములో వారికి కొన్ని బహుమతులు యివ్వబడెను. బిడ్డలను తన యిష్టప్రకారము నడిపింపవచ్చునను ధైర్యమాయనకు గలదు గాని భార్యను నడిపింపగల శక్తి తక్కువయని ఆయనకు తెలియును.

కస్తూరిబాయి ఆయనతో యిట్లనెను. ఆ బహుమతులు మీకును అక్కర లేదు. మా పిల్లలకును అక్కఱలేదు. మీ రెట్లు తాళము వేయుమన్న వారట్లు తాళము వేయుదురు. అవి ధరించుటకు నా కనుమతి నేల ఈయలేదో నాకు తెలియును. కాని నా కోడండ్ర మాటేమి? వారికి ఆభరణము లక్కఱలేదా? వస్తువాహనములతో వారికి పనిలేదా? రేపటి సంగతు లెవ్వరు చెప్పగలరు? అవియన్నియు వారికి అవసరము. అంత ప్రేమతో ఇయ్యబడిన బహుమతులను వదలిపెట్టుటకు నే నంత పిచ్చిదానను గాను. ఇట్లే ప్రతిది వదలిపెట్టుచో, యీ సంసారము బాగుపడు టెన్నటికి?" అని ఏమో పలుకుచూ కన్నులవెంట కన్నీళ్ళు కార్చెను. అయినను గాంధీ హృదయము కరుగలేదు. మనస్సు చలించలేదు. చల్లగా ఆయన ఇట్లనెను. "ఇప్పటికింకను బిడ్డలకు పెండ్లికాలేదు. చిన్నతనములో వారికి పెండ్లి చేయుటకు, నీవును నేనును అంగీకరింపము. వారు పెద్దవారైన తరువాత, వారి జాగ్రతలు వారే పడుదురు. నిజము ఆలోచించుము. వస్తువాహనముల మీద, ఆభ

రణములమీద, పెద్దపెద్ద చీరెలమీద, జాకట్లమీద, భోగముల మీద మోజువడే పిల్లలను తీసుకవచ్చి మన కోమాళ్ళ పెండ్లిండ్లు చేయుము. విధి తప్పివచ్చినప్పుడు, అట్టి వస్తువులతో అవసరమైనప్పుడు, నే నున్నాను. అప్పుడు నన్నడుగుము. ఇప్పుడే యీ తొందరయేల?" అనగా కస్తూరీబాయి మఱల యిట్లనెను. "అప్పుడు మిమ్ముల నడుగవలయునా? మీ సంగతి యిప్పుడే తెలియుచున్నది. నా నగలన్నియు తీసుకొంటిరి. ఎప్పుడో ఖర్చుపెట్టితిరి. అవి మరల నాకు వచ్చుట నేను శాంతముగా నుండుట నాకు లేదు. ఇక కోడండ్లకు నగలు చేయించుట, నేను చూచుట, కలుగునా? ఇప్పటి నుండియే, కుఱ్ఱవాండ్లను సాధువులుగా చేయుటకు యత్నించుచుంటిరి. వారిని చక్కగా సంసారము చేయనియ్యరు. మీ రెంత చెప్పినాసరే యీ బహుమతులు తిరిగి ఇవ్వబడవు. ఉ. పోనీ; సరిగా చెప్పుడు. ఈ నా చంద్రహారముపై మీకు ఏమి అధికార మున్నది?" ఈ పల్కులు విని తక్షణమే గాంధీగా రిట్లనెను.

"ఈ చంద్రహారము నేను చేసిన సేవలకు యివ్వబడినదా? లేక నీవు చేసిన సేవల కివ్వబడినదా?" ఆయమ అందుల కిట్లనెను. "సరే, మీ సేవలకై యిచ్చినారనుకొందము. మీరు సేవచేసినప్పుడు నేను గూడ సేవచేసినట్లుగాదా. రాత్రింబవళ్ళు మీ నిమిత్తమె నేను కష్టపడలేదా? చెమటలు కార్చలేదా! రక్తముధారపోయలేదా? అదియంతయు నాసేవకాదా? ఇంటిలో పనులన్నియు నాచేత చేయించలేదా? నే చేయువటకు

నన్నేడ్పించలేదా. మీ అందరికిని, వచ్చిపోవువారికిని నేను దాస్యముచేయలేదా?" ఇట్లు కస్తూరిబాయి ఎన్నోవిధముల నొచ్చినట్లుపలికినను, ఆయనమాత్రమువానిని తిరిగియిచ్చుటకై రూఢీపరచుకొనియెను. అతికష్టముపై యెట్లో నచ్చజెప్పి ఆమెచేతగూడ నొప్పించెను.

1896-1901 సంవత్సరములలో వచ్చిన బహుమతులన్నియూ ధనముగామార్చబడి, ఒకబ్యాంకులో వేయబడెను. సంఘసేవనిమిత్తమై ఖర్చుపెట్టుటకు ఆ సొమ్ముపై అధికారవర్గము నేర్పాటుచేసెను ఇదిగదా నిష్కామసేవ! ఇదిగదా కర్మయోగ దీక్షాతత్పరత! ఈ అనుష్ఠానమునే శ్రీకృష్ణ భగవానులు భగవద్గీతాశాస్త్రమున రెండవ అధ్యాయమున నలుబదియేడవ శ్లోకమున నిట్లుచెప్పియున్నారు.

శ్లో॥ "కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతుర్భూర్మాతే సంగో స్త్వ కర్మణి".

తా॥ కర్మచేయుటయందే నీ కధికారముగాని, ఫలముగోరుటయం దొకప్పుడును లేదు. కర్మచేయకయూయుండరాదు. ఫలాసక్తిపైని కర్మ ఆధారపడరాదు. అట్టి నిష్కామ కర్మయోగధర్మము పూర్వము జనకమహర్షి ఆచరించెనని గీతయందు చెప్పబడియున్నది. ఇపుడు ప్రత్యక్షముగా గాంధి, అజాద్ మొదలైనవారు చేయుచున్నారు. స్త్రీలలో శారదాదేవి, కస్తూరిబాయియు చేసిరి. శారదాదేవికి ఆజన్మాంతము ధనసంబంధము, భోగసంబంధము లేకుండెను. కొడుకులు, కోడండ్రును లేరు. ఎక్కువ బాధ్యతలు లేవు. బాల్యమునుం

డియు నిరాడంబర జీవితము, భర్తృసేవ, బ్రహ్మచర్యాను ష్ఠానము, దేవీ ఉపాసన మొదలైన విషయములయందే కాలము గడిపెను. భర్తయగు రామకృష్ణపరమహంస, శారదాదేవికి ఉపాసనమొదలు నిర్వికల్పసమాధిపర్యంతము నేర్పెను. కస్తూరి బాయికి, కొన్నాళ్ళు సంసారము తగులాటమున్నను. తదుపరి భర్తగారి ఉత్సాహమున, ఆమెయు ప్రాణములువదలు వఱకు బ్రహ్మచర్యవ్రతమునందే యుండెను. మహాత్ముని సహవాస మున, కర్మయోగమునకు, ధ్యానయోగమునకు, నిరాడంబర జీవితమునకు, స్వార్థత్యాగమునకు కస్తూరీబాయి అలవాటు పడెను. కస్తూరిబాయిజీవితములో నామె యనేకపర్యాయములు అనారోగ్యముల పాలై, మృత్యుముఖముననుండి తప్పించు కొనియె. దక్షిణాఫ్రికాలో నున్నప్పుడు యిట్టి బాధలు కలిగెను. ఒకప్పుడు గృహవైద్యముచేత నామెకు వ్యాధులు కుదిరెను. దక్షిణాఫ్రికాలో వ్యాధిగ్రస్తురాలైనప్పుడు సత్యాగ్రహము జరుగుచుండెను. ఆంగ్లేయ వైద్యుడొకడు శస్త్రచికిత్స చేయ వలయునని చెప్పెను. మొదట సందేహించినను, తుదకు ఆమె అంగీకరించెను, క్లోరోఫారము (అనగా రోగులకు మొదట తెలియకుండునట్లు ముక్కుదగ్గర వాసన జూపించు మత్తు మందు) ఉపయోగింపక ఆపరేషను చేయబడెను. ఆమె యెక్కువ బాధపడవలసి వచ్చెను. ఆమె యెక్కువ ధైర్యముతో ఆ వ్యాధిని యెదుర్కొనెను. డాక్టరుగారు ఆమె భార్యయు, కస్తూరిబాయిని యెక్కువశ్రద్ధతో సేవించిరి, డాక్టరు గాంధీ గారిని జోన్సిబర్గు వెళ్ళవచ్చుననియు, కస్తూరిబాయి విష యమై ఆందోళన లేదనియు, తామే ఆమెను జాగ్రతగా చూచు

కొందుమనియు చెప్పిరి. కొలదిరోజులకే కస్తూరీబాయి పరిస్థితి క్షీణదశకు వచ్చుచున్నదని గాంధీగారికి యుత్తరము వచ్చెను. ఆమె పరుపుపై కూర్చొన లేనంత బలహీనురాలయ్యెను. ఒకపర్యాయము, నిస్సారముచే నిస్పృహురాలయ్యెను. ఆమె భర్త అనుజ్ఞ లేనిదే ఆమెకు సారా గాని, మాంసముగాని పెట్టకూడదని, డాక్టరుగారికి తెలియును. అందులకు ఆయన జోహనిసుబర్గులో నున్న గాంధీగారికి టెలిఫోన్ జేసెను. గాంధీగారు అందులకు అనుజ్ఞ యివ్వలేదు. ఆమెకు పలుకగల శక్తి యున్నచో ఆమె యభిప్రాయము తెలిసికొని ఆమె యిష్టపడుచో యీయవచ్చునని గాంధీగారు వ్రాసిరి. అందులకు డాక్టర్ గారు తిరిగియిటులవ్రాసిరి. "అయ్యా! రోగి యిష్టమెట్లున్నదో, సలహా చేయుట నాకిష్టము లేదు. తమరే తప్పక రావలయును. నా యిష్టము వచ్చినట్లు రోగి నడువవలయును, నేనిచ్చు ఆహారమునే తినవలయును. అట్లు గానిచో నీ భార్య జీవితము విషయమై, నాకు జవాబుదారిలేదు." ఈ యుత్తరము చూచిన వెంటనే గాంధీగారు ఆరోజుననే జోహనిసుబర్గు నుండి, దర్బానుకు రైలులో వచ్చెను. వచ్చిన వెంటనే డాక్టర్ గారిని కలుసుకొనెను. డాక్టర్ గారు యిట్లనెను. "ఇదివరకే కస్తూరీబాయికి తమకు టెలిఫోను చేసినప్పుడే మాంసము రసముతో కూడిన టీని యిచ్చితిని" "ఇట్లు చేయుట మోసమని" గాంధీగారనిరి. "ఆహారముగాని మందుగాని, రోగికిచ్చుటలో, మోసము లేదనియు, అట్లు మోసము చేసినను, అది రోగులకు ఉపకారము కలుగునని తోచినప్పుడు అది ఒక పుణ్యకార్యముగా డాక్టర్లు భావించడమే" అని ఆయన నొక్కి

చెప్పెను. ఈ మాటలు విని, గాంధీగారు చాలా బాధపడిరి. అయినను శాంతముతో సహించెను. డాక్టరుగారు ఆయనకు ముఖ్యస్నేహితుడును, మంచివాడును అయియుండెను. డాక్టరు యందు ఆయనభార్యయందు, గాంధీగారికి ఎంతో కృతజ్ఞతగలదు. అయినను వారి చికిత్సా పద్ధతులు గాంధీగారికి నచ్చలేదు. అప్పుడు గాంధీగారు డాక్టరుగారిని చూచి యిట్లనిరి. మీరేమి చేయదలచితిరో చెప్పుడు. ఆయమకు మరణము రానున్నను, మాంసాహారముగాని, మాంసరసముగాని, ఆవిధమయినవి యేమియూ నాభార్యకిచ్చుటకు నేను ఒప్పుకొనను. ఆపె యిష్ట పడుచో నాకభ్యంతరము యేమీ లేదు. అందుకు డాక్టరుగారు యిట్లనెను; మీ వేదాంతము నేను కాదనను. ఒకవిషయము చెప్పుచున్నాను. వినుడు; నాదగ్గర చికిత్సకై మెన్నాళ్ళు ఉంచె దరో, అంతకాలము నాకిష్టమువచ్చిన పదార్థము రోగికి పెట్టు టకు నాకు స్వాతంత్రముండవలెను. దీనికి మీరు యిష్టపడనిచో ఆమెను యిచ్చటనుంచి తొలగించుమని నేను విచారముతో చెప్పుచున్నాను. నాయింటి వసారాలో ఆమె మరణము నేను చూడజాలను.

గాంధీ:—ఆమెను తక్షణమే యిచ్చటనుంచి తొల గించుమని మీ అభిప్రాయమా!

డాక్టరు:— ఆమెను యిచ్చటనుంచి కదల్చుమని నేనెప్పు డైనను పలికితినా! నేను చెప్పినట్లు వినవలసినదనియు, నాయిష్టము వచ్చినట్లు చేయనిండనియు నేను చెప్పుచుంటిని. అట్లు మీరు చేసినచో నేను నా భార్యయు వలయునంత సేవ చేసెదము. ఆమె విషయమై ఆదుర్దా వదలి మీరు స్థిమితముగా

మరలి వెళ్ళవచ్చును. ఈ చిన్నివిషయములు మీరు గుర్తించనిచో మీభార్యను యిచ్చటనుండి తీసుకొనిపొండు అని చెప్పుటకు నన్ను మీరు బలవంతపెట్టినట్లగును. ఈ సమయమున గాంధీగారితో వారి కుమారుడు కూడానుండెను. కస్తూరిబాయికి మాంసరసములతో కూడిన ఆహారమిచ్చుటకు అతను అంగీకరించలేదు. కస్తూరిబాయి చాల నీరస స్థితిలో ఉండెను. ఏవిషయమును ఆమెతో సంప్రదించగల స్థితిలో ఆమె లేదు. అయినను డాక్టరుగారికిని తనకును జరిగిన సంభాషణ అంతయును గాంధీగారు ఆమెతో చెప్పిరి. ఆమె నిష్కర్షగా యిట్లు జవాబిచ్చెను. నేను మాంసాహారమును పుచ్చుకొనను. మానవుడయి పుట్టుటయే అరుదు. అట్లుపుట్టుట అదృష్టము. నేను మీ చేతులలోనైనను మరణించెదనుగాని మాంసాహారమునుతిని నావ్రతభంగము చేసికొనను. తరువాత గాంధీగారు కస్తూరీబాయితో నిట్లనిరి. నేను చెప్పినట్లు వినవలయునని నీకేమీ నిర్బంధము లేదు. హిందూమతములో కూడా అనేకమంది స్నేహితులు మాంసముగాని, సారాగాని, మందుగా తీసికొనుట నేనెరుగుదును. నీవిష్టపడినచో నేను కాదనను.

కస్తూరి—ఏమైనను సరే, ఎవరెట్లాచరించినను సరే, నేనుమట్టుకు అంగీకరించను. నన్ను తక్షణమే యిక్కడనుండి తొలగింపుడు. మిమ్ము బ్రతిమాలుచున్నాను.

గాంధీగారు ఆ ప్రత్యుత్తరమునకు ఆనందించిరి. కొంచె మాందోళనముండినను ఆమెనచ్చటనుండి మార్చుటకు ఆయన నిర్ధరించుకొనెను. తన నిర్ధారణ డాక్టరుగారితో చెప్పెను.

డాక్టరుగారు కోపముతో నిట్లు కేకలు వేసిరి. "నీవెంత సాహస కార్యము చేయుచున్నావయ్యా ?"

రైలుస్టేషను యిక్కడకు కొంచెము దూరములో ఉన్నది. ఆయన ఆమెను దర్బాన్ స్టేషన్‌లో రైలు ఎక్కించి ఫోనిక్సు స్టేషన్‌లో దింపవలసియున్నది. అచ్చటనుండి రెండు న్నరమైలు రోడ్డుమీద పోవలసియున్నది. ఇది ప్రమాదముతో కూడిన ప్రయాణమేయగును. అయినను ఆయన భగవంతునిపై సంపూర్ణ విశ్వాసముంచి, కర్మయోగమునకు గడంగెను. కస్తూరిబాయిని ఉత్సాహపరచవలసిన అవసరము లేకపోయెను. ఆమెయే యెదురు గాంధీ గారికి ధైర్యముచెప్పి, ఏమాత్రము ఆందోళన పడవద్దని హెచ్చరించెను. అనేకదినములుగా ఆమెకు ఆహారము లేదు. రక్తమాంసములు శరీరమున కానరావు. అస్థిపంజరమా యనునట్లుండెను. ఎముకలు, చర్మముమాత్రమే ఉండెను. స్టేషన్ ప్లాట్‌ఫారము చాల విశాలమైనది. రిక్షాలోపలికి పోవుటకు వీలు లేదు. రైలుబండి ఎక్కుటకు కొంత దూరము నడువవలసియుండెను. గాంధీ కస్తూరిబాయిని తన చేతులతో ఎత్తుకొని మోసుకొనిపోయి రైలు బండిలో కూర్చుండ బెట్టెను. ఫోనిక్సు స్టేషన్‌నుంచి పల్లకీలో మోసుకొని పోబడెను. హైడ్రోపథిక్ చికిత్సావిధానములో ఆమె క్రమ క్రమముగా కొంచెము కొంచెము బలము సంపాదించెను. ఫోనిక్సు జేరిన రెండు మూడురోజులకు ఒకస్వాములవారు వారిదగ్గరకువచ్చిరి. కస్తూరి బాయి దీక్షను విని ఆమెయందు దయగలవాడై ప్రాణాపాయ సమయమున ఆపద్ధర్మముగా మాంసాహారము స్వీకరించవచ్చునని మను ధర్మశాస్త్రము నందున్నదని కొన్ని శ్లోకములుపఠిం

చెను. అట్టి శ్లోకములు కల్పితములని గాంధీగారు నిర్ధారణచేసి కొనిరి. కస్తూరిబాయి విశ్వాసము అచలమైనది. శాస్త్రగ్రంథములు ఆమె చదువుకొనకపోయినను తాతలనాటినుండి వచ్చిన ఆచారములే ఆమె ఎక్కువగా పాటించుచుండెను. స్వాములవారితో ఆమె యిట్లనియెను. "తమరెన్ని విధములుగా ఎన్ని శాస్త్రములు చెప్పినను సరే మాంసాహారమును తిని నాశరీరరక్షణను కోరను. ఈవిషయమై నన్ను కలత పరచకుడు. శాస్త్ర చర్చ చేయదలచినచో మావారితోను పిల్లలతోను చేయుడు. నామనస్సుయిదివరకే బాధపరచటమైనది. మఱొకపర్యాయము యిట్టి వ్యాధియే శస్త్రచికిత్స జరిగినతర్వాత కస్తూరిబాయికి కలిగెను. బాధ మిక్కుటముగా నుండెను. ఎన్నిప్రయత్నములు చేసినను కుదురలేదు. ప్రయత్నములన్నియు విఫలములయ్యెను. ఉప్పు మొదలైన పదార్థములు వదలిపెట్టవలయునని ఆయన చెప్పెను. ఆమె అందుకు అంగీకరించలేదు. అట్లు వదలవలయునని గాంధీగారికి ఎవరైనను సలహా చెప్పినను ఆయనకూడా వదలజాలడని ఆమె సవాలుచేసెను. గాంధీగారి మనస్సున విచారము, సంతోషము ఒక్కసారిగా అలముకొనియెను. ఆయనప్రేమతో యిట్లనియెను. "నీవు పొరబడుచున్నావు. నాకే, సుస్తీవచ్చి, ఫలానా పదార్థములు వదలవలయునని డాక్టరు చెప్పుచో నేను అప్పుడే వదలువాడను." అయితే కస్తూరిబాయి చూడు; ఏ డాక్టరు సలహా లేకయే ఒక సంవత్సరమువరకు ఉప్పుమొదలైనవి వదలిపెట్టుచున్నాను. నీవు వదలిననుసరే వదలకపోయిననుసరే." కస్తూరిబాయి యీ మాటవిని చకితయై, చాల బాధపడి దుఃఖముతో

యిట్లనియెను. "నన్ను క్షమించండి, మీ సంగతి తెలిసికూడ మీ కు(దేశముకలుగునట్లు చేసితిని. దయయుంచి చెప్పినట్లు వినండి. నా పట్టుదల వదలకుందు"నని ప్రమాణములు చేయు చున్నాను. మీ ప్రమాణమును తీసివేసికొనుడు. ఇట్టివి నేను భరింపలేను." గాంధీగారు అందులకు యిట్లనిరి. "ఇవిఅన్ని వదలి పెట్టుట నీకు చాల శ్రేయస్కరము. అప్పుడు నీవు యిప్పటిస్థితి కంటె చాల బాగుందువనగలను. నా విషయమై ఆలోచించి నచో అన్నమాటను వెనుకకుతీయుట నా స్వభావముకాదు. నా నిగ్రహము నాకు మేలేచేయును. ప్రోత్సాహముఎట్టిదయినా నిగ్రహము మానవుని సంపూర్ణునిగా చేయును. కావున నా పద్ధతికి నన్ను వదలుము. నాకు నిగ్రహశక్తికలదో లేదో పరీ క్షించుకొనియెదను." అందులకామెయు మీ పట్టుదల త్రిప్పు టకు బ్రహ్మకైనను వశంబుకాదు. మీ రెవరిమాటలు వినరు. అని చెప్పి కన్నీటివరద ప్రవహింప జేసెను.

పాఠకులారా ! నిగ్రహమునుగూర్చి మన మాలోచించ వలసి యున్నది. నిగ్రహము సామాన్య విషయముకాదు. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసాది, ఏ ఆశ్రమములో నుండువారికైనను నిగ్రహము చాల అవసరము. నిగ్రహము మానవుని శుద్ధుని చేయును. ఇష్టమువచ్చినట్లు యిష్టమైన పదా ర్థములపైకి సంచరించు యింద్రియములను వెనుకకు మరలించి అదుపాజ్ఞలలో ఉంచి, వాటిని ఆత్మవైపునకు త్రిప్పుటయే నిగ్రహమువలన సాధించవలసిన కార్యము. ఇందులకు ఎన్ని ప్రయత్నములు విఫలములనయినను, మరల ప్రయత్నించ

వలసిందే. ఆత్మస్వారాజ్య సంపాదనకై విశ్వామిత్రుడు ఎన్ని
వ్రయత్నములు చేయలేదు ?

ఎప్పటిమాటలో ఎందులకు ప్రస్తుతము అరవిందఘోషు
రమణమహర్షి, మొదలైనవారు ప్రయత్నములు చేయుట
లేదా? అందులకై గాంధీగారు ఎన్నికష్టములు పడుటలేదు
మానవజీవితమునందు, ఒక క్షణమైనను యింద్రియాతీతమగ
ఆత్మానందమును రుచి చూడనిచో యీ జన్మ వ్యర్థపరచు
కొనినట్లే ఇంద్రియములు అతిసూక్ష్మములు. మనస్సు వాటి
క్షణములో టోపీ వేయగలదు. బ్రహ్మచారిని గృహస్థాశ్ర
సుఖములవైపునకు, గృహస్థును సంసారలంపటత్వములో
నికిని, సన్యాసిని, శిష్యులను, శిష్యురాండ్రను, చేర్చుకొనుట
యందును, మతస్థాపనాది విషయములయందును మనస్సు అ
సులువుగాలాగి గిరగిర త్రిప్పి కొట్టి ఆత్మను అధోగతిలో త్రోయ
గలదు. అట్టిమనస్సును వెనుకకు త్రిప్పుటయన్న కొండపై
బండినెక్కించుటే యగును. ఇందులకు శాస్త్రజ్ఞానము ఎక్కు
వగా పనిచేయజాలదు. వైరాగ్యమే శరణ్యము.

ఇంక కథాంశములోనికి వచ్చెదముగాక. తన జీవి
తమునందు యిదిఒక పెద్దఘట్టమనియు, చిరస్మరణీయమనియు,
సత్యాగ్రహమునకు యిది ఒక నిదర్శనమనియు గాంధీగారు తలం
చుచుండెను, ఆమె ఉప్పుమొదలైనవి వదలిపెట్టెను. ఆమెను స్త్రీ
కూడ సంపూర్ణముగా నివారణమయ్యెను. ఆయన పలుకుబడి
హెచ్చించుకొన్న వాడయ్యెను. తాను గొప్పకార్యములు
చేయవలసి యున్నదనియు, పరమేశ్వరసేవకై పిలుపువచ్చు

ననియు, ఫలాపేక్షవదలి తన కష్టసుఖములు, తన సంసార పరి స్థితులు లక్ష్యముచేయక ఆ పిలుపు ప్రకారము పని చేయవలసి యున్నదనియు ఆయన గ్రహించెను. ప్రథమమున తానున్న స్థలములో తెల్లవారి బాధలనుండి నల్లవారిని తప్పించుటకును, తరువాత యీ కార్యమూలమున ఇతర దేశములలోగల అధి కారమదోన్మత్తులనుండి దీనులను, పేదలను సంరక్షించుటకును ఆయన తలంచెను. తన సంపూర్ణ శక్తి యుక్తులను సంపూర్ణ ముగా తన మనోభావములను, దేశసేవా యజ్ఞమున సంపూర్ణ ముగా ఉపయోగింపవలెనన్న, ఏకాదశేంద్రియ సంబంధము లగు పశుసౌఖ్యములను, తాను సంపూర్ణముగా వైరాగ్యా గ్నిలో ఆహుతి చేయవలసియుండునని 1906 సంవత్సరములో ఆయన గ్రహించెను. 1906 సంవత్సరములో ఆయన బ్రహ్మ చర్య దీక్ష తీసికొనుటకుగల కారణమును ఆయనతనజీవితచరిత్ర యందు యిట్లు చెప్పియుండిరి. "మనోవాక్కాయములచే మానవసేవ చేయదలచినవాడు బ్రహ్మచర్యమును తప్పక అను ష్ఠించి తీరవలయును. సంసార సుఖము లనుభవించుటయందును, సంతానమును గని వారిని పోషించుట యందును కాలమును గడుపుచో దేశసేవ చేయుటకు నేను తగనని తెలిసికొంటిని. ఒక్కమాటలో చెప్పవలసినచో శరీర రక్షణ, ఆత్మోద్ధరణ యీ రెండును చూచుకొనుట నావలన కానివని."

కావుననే గాంధీమహాత్ములు 1901 సంవత్సరం మొదలు, ఉండియు ఉండనట్లు అడపా దడపా బ్రహ్మచర్యము అవలం బించినను, 1906 సంవత్సరము మధ్యభాగములో అందులకు

ఆయన తీవ్రప్రమాణము గైకొనెను. ప్రమాణమును తీసుకొన్న
సమయమున తప్ప అదివరకు బ్రహ్మచర్య విషయమై కస్తూరి
బాయితో ఆయన సంప్రదించి ఉండలేదు. కస్తూరిబాయియు
యే యభ్యంతరము చెప్పలేదు. తీవ్రమగు ప్రమాణము తీసు
కొనుటకు ఆయనకంత బలములేదు. కాని దైవబలముపై
ఆధారపడియే అట్లొనర్చెను. ఆ దీక్ష కొన్ని దినములు పాలించిన
తరువాత అందలి అనుభవములను ఆయన లోకమునకు ప్రసా
దించెను. బ్రహ్మచర్యము ప్రారంభించినది మొదలు ఆ దంప
తులకు స్వేచ్ఛ హెచ్చెను. కస్తూరిబాయి స్వతంత్రురా
లయ్యెను. ఆమెపై గాంధీగారి అధికారములు తగ్గిపోయెను.
కామదాసు దేవదాసాయెను, మన్మథ సేవాపరాయణుడు దేశ
సేవాధురంధరు డయ్యెను. ఇతర స్త్రీలయందెట్లు ఆయనకు
మాతృభావము కలదో, ఇతర స్త్రీలెట్లు పూజ్యురాండ్రో
కస్తూరిబాయి అట్లే పూజ్యురాలయ్యెను. స్త్రీయొక్క మాతృ
స్థానమును ఆయన గుర్తించెను. ఆ క్షణము మొదలు కస్తూరి
బాయి మాత్రమెగాక యితర స్త్రీలందరును వయస్సులోగల
తారతమ్యములను అనుసరించి చెల్లెండ్రో, కుమార్తెలో,
తల్లులో అయిరి. ఆయన దృష్టిలో మోహము కామము పోయి
ఆస్థానమున శుద్ధప్రేమ స్థాపింపబడెను.

శారదాదేవియు భర్తయొక్క బ్రహ్మచర్యమునకు,
యేమాత్రము అడ్డురాలేదు. భర్తయొక్క కార్యదీక్షలో, భర్త
యొక్క భావములలో, ఉపాసనలలో, నడకలలో, వయస్సున
చిన్నదయ్యు, సంస్కారబల మధికముగా నుండుటచే తనపతిలో

లీనమయ్యెను. ఆమె జీవితమునందు యెట్టి రోగములకు నామె
వశురాయినట్లు కన్పడలేదు. చదువు విషయములో శారదా
దేవియు, కస్తూరిబాయియు సమానులే అయినను, కస్తూరి
బాయి జీవితములో ఆమెకు తగులుకొన్న విషమావస్థలు
శారదాదేవి జీవితమునందు కనుపడవు. గాంధీ మొదటనుండియు
బ్రహ్మనిష్ఠుడుగాడు. ఆయన త్రొక్కిన మార్గము అడుగడు
గునకు ముళ్ళతో కూడినదే. రామకృష్ణునకా భాగ్యము పట్ట
లేదు. భూతదయ, పశ్చాత్తాపము, ప్రేమ, ఇరువురియందును
కలవు. ఇరువురును నిరాడంబరజీవులే. మానవులయొక్క
ఆత్మోద్ధరణకై రామకృష్ణుడు పనిసేసెను. మహాత్ముడు ప్రజల
యొక్క ఆత్మోద్ధరణకు సాధనమగు శరీర పోషణ కవసరమగు
కూడు, గుడ్డ ప్రజలకందించుటకై ప్రయత్నించుచుండె. అంత
మాత్రమేగాక, మోక్షోపాయములగు సత్యప్రవర్తన, అహింసా
ధర్మము, బ్రహ్మచర్యము, నిష్కాపట్యము, మొదలగునవి తా
ననుష్ఠించుచు ప్రజలకు మార్గదర్శకుడయ్యెను. కస్తూరిబాయియు
ఆయన గొప్పతనము గ్రహించి ఆయన అడుగుజాడలలోనే
నడచి స్త్రీ లోకమునకు మార్గదర్శకురాలై వెలసెను. శారదా
దేవియు తోడి స్త్రీలోకమునకు ఆదర్శకమై ప్రకాశించెను.
మహాత్ముడు బ్రహ్మచర్యదీక్ష గైకొన్న కొంతకు మూడు
నెలలకే పరీక్షార్థమో యనునట్లు దక్షిణాఫ్రికాలో సత్యా
గ్రహ సమరము ప్రారంభింపవలసి వచ్చెను. ఆయనతోబాటు
కస్తూరిబాయియు అనుపమానములగు కష్టములనే పడి కఠిన
సమస్యల నెదుర్కొనెను. సత్యాగ్రహము జరుగుచున్న

కొన్నాళ్ళవరకు ఆ యుద్యమము గూర్చి కస్తూరీబాయి యుద్దేశ్యము సరిగా లేదని గాంధీగారు, దురభిప్రాయపడి, ఆమె నందులో ప్రవేశపెట్టుటకు అతి డేమియూ శ్రద్ధ తీసికొనలేదు ఒకనాడుపోసికన్న సెటిల్ మెంటులోనున్న స్త్రీలతో సత్యాగ్రహము నందు వారిని ప్రవేశబెట్టుటకై గాంధీగారు సంభాషణలు సల్పు చుండ, కస్తూరీబాయి తటాలునవచ్చి యిట్లనెను, "ఏమండీ! ఈ విషయము నాతో ముచ్చటించనందులకై చాల విచారించుచున్నాను. జైలులోకి బోవుటకు నా కర్హత లేదా? కారాగార నివాసమునకు తగిన లక్షణములు నాకులేవా? నా దగ్గర యేమి లోటుగలదు? ఏ కార్యమును గురించి యితరులను మీరు ఆహ్వానించుచున్నారో, ఆ కార్యమున మీకు తోడ్పడుటకు నేను సిద్ధముగా నున్నాను" గాంధీగా రిట్లు జవాబు చెప్పిరి. "నీకు తెలియునుగదా. నిన్ను బాధపెట్టుటయందు నా కేమాత్రమును యిష్టము లేదు. నీయందు నాకు విశ్వాసము లేకను కాదు. నీవు జయిలునకు వెళ్లుచో నేను చాలా సంతోషించెదను. కాని, నా సలహాపైగాని నా బలవంతముచేతగాని నీవు జైలునకు పోరాదు. ఇట్టి విషయములయందు యెవరికి వారే వారి బలమును, వారి ధైర్యమును పరీక్షించుకొనవలయును. నేను నిన్ను జైలుకు బొమ్మనినచో, నీవు నన్ను సంతృప్తి పరచుటకై జైలుకు పోవుదువు. నీయంతట నీవు నీబుద్ధి పూర్వకముగా జైలునకు పోవుచో, అచ్చట బడుకష్టములు సంతోషముతో స్వీకరింతువు, న్యాయస్థానములో ధైర్యముగా మాట్లాడుదువు కావున యిట్టిబాధలు సహింపగలవో లేవో నని

నేను నిన్ను ప్రోత్సాహపరచలేదు" అందులకు కస్తూరీబాయి యిట్లనెను "జైలులో ఒకవేళ బాధలు బడవలసివచ్చి నప్పుడు బాధలే బడెదనుగాని క్షమార్పణగోరి బయటికిరాను. మీరు గాని మీ కుమాళ్ళుగాని దేశము నిమిత్తమై అనేకకష్టములు బడుచున్నప్పుడు, నేను మాత్రము బడజాలనా? నేనును యుద్ధ రంగమున దుమికెదను. వీరపత్ని, వీరమాత, యీ రెండు పేర్లు సార్థకపరచెదను. భారత వీరనారీమణుల పౌరుష ప్రతాప క్షమా స్థైర్యములను ప్రకటించెదను."

ఈ సంభాషణ జరిగిన తర్వాత కస్తూరీబాయి అపరిమిత యుత్సాహముతో తన భర్తకు కుడిభుజమై నిలువబడి, తానును, అసాధారణమగు నిష్కామ కర్మయోగిని యయ్యెను. దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహము షుమారు ఆరు సంవత్సరములు జరిగెను. గాంధీగారితో గూడ కస్తూరీబాయి అనేక మారులు కారాగారములో నుంచబడెను. అనేక పర్యాయములు రాజభటులచే పట్టుకొనబడెను. భారత వీరుడగు, గాంధీ మహాత్మునికి తగిన యిల్లాలనిపించుకొనెను. అబల సబల యయ్యెను. ఆయనతో బాటు, ఒక క్షణమైనను కాలమును వ్యర్థము చేయక ఆయాసమును ప్రకటింపక నిరుపమానమగు శక్తి సామర్థ్యములతో, తను మన ప్రాణములు, దేశాధీనము జేసి స్త్రీలోకమునకు ఆదర్శప్రాయురాలై పురుషసింహములు గూడ నేర్చుకొనునట్లు సంచరించెను. ప్రప్రధమముననే అచ్చటి పఠానులవలన తన భర్త చంపబడునా యను దృశ్యమును ఆమెగాంచెను. ఆ పఠానులును గాంధీగారిని పొరబాటున తమ దేశశత్రువుగా

భావించిరి. మొదటి పర్యాయము ఆయన జైలునకు పంప బడెను. సాధారణ మానవునివలె కంకర రాళ్ళుగొట్టుటకు జయిలులో నియమింపబడెను. పదునాల్గు రోజులు గాంధీగారు జైలునందుపవాసముండిరి. ఇట్లనేక బాధలుపడి పడి, తుదకు గాంధీగారును, కస్తూరీబాయియు, జయప్రదులై అచ్చటి ప్రజల మన్ననలకు పాత్రులయిరి. అచ్చటి ప్రజల కష్టములను ప్రజలలోగల భయమును పాఱద్రోలి అచ్చటి ప్రజలను స్వేచ్ఛావాయువును పీల్చునట్లు జేసెరి.

1915 సం॥ జనవరినెలలో, తనభార్యా బిడ్డలతో గాంధీ గారు హిందూదేశమునకు మరలివచ్చిరి. మేనెలలోనే అహ మ్మదాబాదు నగరములో, సత్యాగ్రహాశ్రమమునకు పునాది వేసిరి. అదే గాంధీగారి కుటుంబము, నివసించుటకు యిల్లువంటి దయ్యెను. సత్యాన్వేషణపరుల శిక్షణస్థాన మయ్యెను. ఆశ్రమ ములో చేరుటకు కస్తూరిబాయి ముందంజవేసెను. ఆమెయే ప్రథమ శిష్యురాలుగ స్వీకరింపబడెను. ఆశ్రమోద్దేశ్యములను నెరవేర్చుటకు గాంధీ, కస్తూరిబాయి ఇరువురితో కలిసి, స్త్రీ పురుషులు 25 మంది మాత్రము చేరిరి. ఆశ్రమములో చేరిన సేవకులందరును ఒక కుటుంబమువలెనే కలిసి వండుకొని కలిసి భోజనము చేయుచుండిరి. ఆహా! భారతీయులందరును కలసి తమలోగల భేదభావములను మరచి ఏనాడు పంక్తి భోజనము కావింతురో ఆనాడే అదృష్టదినమని అనేకులు తలంచుచున్నారు. చేరినవారందరును యే ప్రసక్తిగాని, యే విషయముగాని వచ్చినపుడు కస్తూరిబాయినే మాతగా స్వీక

రించి, ఆమె అమూల్య సలహాలను పొందుచుండిరి. కస్తూరి బాయిని ఆ రోజులలో చూచిన శ్రీమతి సరోజిని నాయుడు గారు యిట్లు పలికిరి. "భర్త కుడిభుజమో యనునట్లు నిరాడంబరమై, స్థిరచిత్తముకలదై, దర్జా నిరూపించు వదన సౌకుమార్యముతో, కష్టమువచ్చినపుడు వెనుదీయని వీరవనితయై, దయాస్వరూపిణియై యున్నట్లు తోచెడిది. సత్యాగ్రహ సమరములో దెబ్బలుతిన్న వారికి కట్లుకట్టుచుండెను.

తానేమో కరకుగుడ్డలు ధరియించి సంతృప్తిచే ముఖము నందు కళ లుట్టిపడునట్లు సేవచేయుచుండెను. గాంధీగారి అర్థాంగలక్ష్మి యని ఆమె ఎప్పుడును గర్వించియుండలేదు. కఠినమగు నేలమీదనే పరుండియుండి, దేశమునకై యెట్టి త్యాగమునైనను చేయుటకు సిద్ధపడియుండి, భారతమాత పాదపద్మములను తన రక్తధారలచే క్షాళనమొనర్ప సిద్ధముగ నుండెను."

ఆశ్రమ ప్రారంభమునుండియు ఆశ్రమజీవితము శాంతియుతముగ లేదు. ఒడుదుడుకులతోనే కూడియుండెను. ఆశ్రమ పద్ధతులను వ్రాయపూనుకొనినప్పుడు హరిజనులను చేర్చుకొనవచ్చునా లేదా యను సమస్య బయటపడెను. ఇతర విషయములయందు తృప్తిగాయున్నచో, ఆశ్రమ సేవకునిగా హరిజనుని చేర్చుకొనుటకు తనకెట్టి అభ్యంతరమును లేదనియు, ప్రథమ అవకాశము అట్టివానికే ఇవ్వబడుననియు గాంధీగారు స్పష్టపరచిరి ఆశ్రమస్థాపనయైన కొలది నెలలకే, పరీక్షాదినము వచ్చినది. ఆశ్రమ పద్ధతుల కొప్పుకొని, ఆశ్రమములో చేరుటకై హరిజన కుటుంబమొకటి వచ్చెను. ఇది హఠాత్తుగా

సంభవించినది. ఆశ్రమములోనున్న కొందరితో గాంధీగారు సలహాచేసి, ఆయన వారిని చేర్చుకొనెను. ఆశ్రమములోనున్న కొందరకును, ఆశ్రమమునకు ధనసహాయముచేయుచున్న మరి కొందరకును యీ పని అయిష్టముగా తోచెను. ధనసహాయము చేయువారు వారిపనిని మానిరి. ఇతర స్నేహితులు కొందరు ఆశ్రమమును వెలివేయుటకు ప్రయత్నించిరి. కొలదిరోజుల లోనే ధనాదాయమునుగురించిన విషయమును, గాంధీగారెట్లో సరిచేసికొనిరి. కాని ఆశ్రమములోనున్న స్త్రీలు కస్తూరిబాయి మున్నగువారితో సరిచేసికొనుట కష్టమయ్యెను. ఆశ్రమము బహిష్కరింపబడుట స్త్రీల కిష్టములేదు. గాంధీగారు ఎందరి నైనను ఒప్పించెనుగాని, కస్తూరిబాయినిమాత్రము ఒప్పించ లేకుండెను. పురుషసింహాలనేక లిట్లేయుందురు. వారిలోగల సంస్కారణమును వారి భార్యలయందు ప్రవేశపెట్టలేరు. భారత దేశమునందు స్త్రీలకు చక్కని విద్యావిధానము లేకపోవు టయే దీనికిగల కారణము. గాంధీ చిన్నబుచ్చుకొనియెను. విచారవదనుడయ్యెను. ఏడు రోజులవరకు ఆయన ఆహారము మానెను. గాంధీజీ యీ యుపవాసమునకు కారణము కస్తూరి బాయియొక్క నిరాదరణ, నిర్లక్ష్యము, ఆచారమునందలి పట్టు దల. ఆశ్రమమునందలి వ్యక్తులలో ఎవరికిని గాంధీగారియుప వాసకారణము తెలిసికొను నూహ కలుగలేదు. కస్తూరిబాయి మాత్రము ఈ విషయమున మెలకువగనే యుండెను కస్తూరి బాయి ఎన్నోవిధముల తెలివితో నాలోచించెను. 1 తన ఆచా రమును వదలుకొనుటయా ? 2 ఆశ్రమమునకు ప్రాణముగు

గాంధీగారిని వదలుకొనుటయా? 3 ఆశ్రమముయొక్క ఉద్దేశ్యములు సఫలమగు టెట్లు?" ఇట్లు ఆలోచించి తుదకు విశాల దృష్టి నుపయోగించి, గాంధిగారి యిష్టముచొప్పున నడచుటయే మంచిదని నిశ్చయించుకొనెను. ఆనాడు మొదలు అందరి యందువలె హరిజనులయందును ప్రేమ ప్రసరింపజేసెను. కుల భేదములు పాటించక అందఱకును సేవచేయ నారంభించెను.

అస్పృశ్యతా నివారణమునకై తన భర్తతోపాటు కష్ట పడుచుండెను. అహా! ఈ దురాచారము భారతీయుల దయాదృష్టికి ఎంత కళంకముగా నున్నది? స్త్రీరత్నములారా? దీనిని తొలగించుటకై పూర్ణముగా ప్రయత్నించరా? భారత దేశమున భరతమాత బిడ్డలలో కొన్ని కోట్లమంది దూరముగా నుంచబడుట న్యాయముగా తోచెనా? వారికి తగిన ధన సంపత్తియును ఆరోగ్యభాగ్యమును చేకూర్చినచో వారిలో నుండి ఎందరు కవులు, రాజకీయవేత్తలు, ఎందరు భక్తులు, ఎందరు జ్ఞానులు, ఎందరు ప్రవక్తలు, ఎందరు ఆచార్యపురుషులు, అవతారమూర్తులు యుద్భవిల్లియుందురో? జగద్గురు శంకరాచార్యులుగారు జ్ఞానముగల హరిజనసోదరుని గొప్పతనమును గ్రహించి నమస్కరించిరి. శ్రీ రామానుజాచార్యుల వారు హరిజనులకు దేవాలయ ధ్వజస్తంభమువరకు వచ్చునట్లు హక్కుల నిచ్చిరి. హరిజనులకు సంపూర్ణముగా స్వామి దర్శనభాగ్యము కలిగించిన మహాత్ముడు చిరకాలము వర్ధిల్లును గాక! అమాయకులను పెట్టిన బాధ, పతివ్రతలకు చేసినబాధ, స్త్రీల నణగత్రొక్కిన దోషము, ఇవన్నియు కట్టికుడుపక పోవు

భారతీయులారా! ఇప్పటికైనను మేలుకొనుడు. సమత్వభావమును ప్రసరింపుడు. దేశ సౌభాగ్యమునకై, తోడ్పడుడు. అవ్వలారా! ఎవరులేనిది మీపంట మీయింట చేరదో, ఎవడు త్రివ్వనిది మీ గొంతుకలలోకి జలమురాదో, ఎవ్వడు ఇటుకతీయనిది మీకు దేవతాదర్శనము కాదో, అట్టి మీ హరిజన సంతానమును మీ ఇండ్లకును మీ నూతులకును, మీ దేవాలయములకును దూరముచేయుచున్నారు. మహమ్మదీయ సోదరులను చూచియయినను చూడుడు. మీ మతము విశాలమైనది. మీ మతధర్మములు విశాలమైనవి. మీ హృదయములే విశాలములుగా లేవు. ఆర్యమతము నుద్ధరింపుడు. ఋషిపథమును బాహాటముగా చాటుడు.

అహింసాధర్మమును అందరియందును చూపుడు. మీ ఇష్టదైవమే హరిజనులకు ఇష్టదైవము. మీ ఆదరణలేక ప్రతి సంవత్సరము, ఎందరు హరిజనులు ఇతర మతముల పాలగుచున్నారో గమనింపుడు.

అనాథల యందును, పేదవారియందును కస్తూరిబాయికి అమితప్రేమ. 1917 సంవత్సరమున చాంపరాన్ గ్రామస్తుల తరఫున గాంధీగారు పనిచేసిరి. ఆ గ్రామస్తులు అనేక సంవత్సరములుగా నీలిమందు వ్యాపారస్తులగు తెల్లదొరల అధికారము క్రింద అణగద్రొక్కబడి యుండిరి, వారికి తెలివితేటలు బోధించుటకై గాంధీగారు కస్తూరిబాయిని యింకను అనేకమంది స్త్రీలను నియోగించిరి, ఆయనచే ప్రారంభించబడిన ఆరు గ్రామములలోని బడులకు ఆమెను ఉపాధ్యాయినిగా ఏర్పాటు

గావించెను.అప్పటికి ఆమెకు గుజరాతిభాష వ్రాయను చదువను రాదు.

ఇంక నామె ఉపాధ్యాయినిగా ఏమి బోధించెను? పరిశుద్ధముగా నుండుట, మంచి నడవడికయు, క్రిమశిక్షణ, సర్దుబాటు, మొదలగు విషయములు ఆమె, ఆ గ్రామములలో బోధించెను. ఆమె పేదవాళ్ళ గుడిసెలలోనికి పోయెను. అచ్చట వారి మురికిగుడ్డలను చూచెను. సవరించెను. ఉతుకుకొనునట్లు నేర్పెను. ఆ పేదవాండ్రు చెప్పు మాటలన్నియు గాంధీగారికి చెప్పుచుండెను. ఒక పేదస్త్రీ యిట్లనెను: "నాకు ఒకటే చీర యున్నది. కావున ఉతుకుకొనలేదు, నాకు మరొకచీర ఇచ్చునట్లు గాంధీగారితో చెప్పుడు. అపుడు ప్రతిరోజు గుడ్డ లుదుకుకొని శుద్ధముగా నుందును." చదువరులారా! దేశదారిద్ర్య మెట్లున్నదో కస్తూరిబాయి ఆనాడు తెలిసికొనియెను. ధనవంతులారా! జమీందారులారా! మీ మీ గ్రామములలో దారిద్ర్యము లేకుండునట్లు చేయజాలరా?

దరిద్రబాధ స్వయముగా మీ రనుభవించినగాని మీ కట్టి ఆసక్తి కలుగదేమో! పేదవాళ్ళకు సేవచేయుటచే కస్తూరిబాయికి దేశమునందెంత దరిద్రమున్నదో ఎంతజ్ఞానమున్నదో, ఎంత అనారోగ్యమున్నదో తెలిసెను. కావుననే ఆమె హృదయమున దేశభక్తి వృద్ధిపొందెను. తక్షణమే దరిద్రనారాయణ సేవచేయుటకై పూనుకొనెను.

## కారాగార శిక్షలు

1921 సంవత్సరములో గాంధీమహాత్మునిచే ప్రారంభింప బడిన సహాయనిరాకరణ యుద్యమములో ఆమె చురుకుగా పనిచేసెను. 1930, 1932 సంవత్సరములలో కూడ, బయలుచేయబడిన యుద్యమములలో పనిచేసెను. ఆయా యుద్యమములలో అనేకపర్యాయములు కారాగారమున కేగెను. అనేక కష్టములు పడెను. 1922 సంవత్సరము మార్చి నెలలో గాంధీగారు ఖైదు చేయబడెను. విచారణ తీరినవెనుక ఆరు సంవత్సరములు శిక్ష వేయబడిరి. ఆ సమయమున శ్రీమతి కస్తూరిబాయి ధైర్యము వహించి భారతదేశమునకు యీ క్రింది సందేశ మొసంగెను. "నా ప్రియమైన సోదరులారా! సోదరీమణులారా! ఈ రోజు నా ప్రియమైనభర్త ప్రభుత్వము వారిచే ఆరుసంవత్సరములు కారాగార శిక్ష విధింపబడిరి. ఈ కఠినమగు శిక్ష వారికేగాక నాకును చాల బాధాకరమేయగును. మన మందరమును కలసి తీవ్రముగా పనిచేయుచో, వారి శిక్షా కాలము పూర్తికాకమునుపే వారిని విడిపించుకొనవచ్చును. ఈ ఆశతోడనే నన్ను నే నోదార్చుకొంటిని,

హిందూదేశము నిద్రనుండి మేలుకొని, కాంగ్రెసువారి సిద్ధాంతములను మిగుల శ్రద్ధతో అమలుపరచుటకు పూనుకొనినచో గాంధీగారిని వదలించుకొనుటమాత్రమేకాదు; పదునెనిమిది నెలలనుండి మనము ఏసిద్ధాంతములకై పోరాడుచు శ్రమపడుచున్నామో వానినికూడ సంతృప్తికరముగా సాధించుకొనవచ్చును. ఈవిషయమున నాకేమాత్రము సంశయము లేదు,

కావున నుపాయము మనకు తెలిసియేయున్నది. మన విధిచేయుటయందు మనము తప్పినచో నేరము చేసినవార మగుదుము. నాయందు ప్రేమయు, నాభర్తయందు గౌరవమును గల స్త్రీ పురుషులందరకును నాచేయు విజ్ఞప్తి యిదియే. మన మందరమును కార్యరంగమున దూకి కార్యసాఫల్య మగునంత వరకు నిద్రపోరాదు. కార్యక్రమములో రాట్నపరిశ్రమమునకును, ఖద్దరునూలునకును ప్రాధాన్య మీయబడినది. ఈ విధానము హిందూదేశము ఆర్థిక పరిస్థితులు సరిచేయుటమాత్రయేగాక రాజకీయదాస్యమునుండి మనలను విముక్తిచేయును. గాంధిగారి శిక్షకు ప్రతీకారముగా ఈమూడు సిద్ధాంతములను భారతీయులు అమలునందుంచవలెను.

(1) స్త్రీ పురుషు లందరును విదేశవస్త్రములను కట్టుట మానవలెను,

ఈవిషయమున నితరులను ప్రోత్సహించవలెను.

(2) స్త్రీలందరును ప్రతిరోజు దైవవిధిగా రాట్నము త్రిప్పుచు చేతితో నూలుతీయవలెను.

(3) వర్తకులందరును విదేశీవస్తువులను వ్యాపారము చేయరాదు.

1924 సంవత్సరమున సెప్టెంబరుమాసములో గాంధిగారు హిందూ ముసల్మానులు ఐక్యతకొరకై 21 దినములు ఢిల్లీ పట్టణములో కఠినోపవాసము చేసిరి. అట్టి వ్రతము నవలంబించుట మృత్యుముఖమున బడుటయే. ఆ సమయమున కస్తూరిబాయి హృదయము ఎట్లుండెనో ఆమెకే తెలియనగును. తనహృద

యాంతరాళమున జగత్పతినిగూర్చి ఎన్ని ప్రార్ధనలుచేసెనో! మృత్యుముఖమునుండి తనభర్తను రక్షించుకొనుటకు, అనాటి సావిత్రివలె యెంత ఆవేదనపొందెనో ! ఇట్టి ఘోరసమస్యలు తన భర్తమూలమున, ఆమె ఎన్నియో భరించెను. 1932 సంవత్సరములో జనవరి 18వ తేది కస్తూరిబాయికి ప్రభుత్వము వారు ఆరువారములు కారాగారశిక్ష విధించిరి. ఆమెను విడుదల చేసినంతనే మరల మార్చి 15వ తేది ఖైదులోపెట్టిరి. మరల ఆమెపై నేరముమోపబడెను. ఛార్డోలిమేజస్ట్రీటు ఆరునెలలు కారాగారశిక్ష విధించెను.

ఈ విధముగా కస్తూరిబాయి దేశము నిమిత్తమై మాటి మాటికి బాధలు పడుచునే యుండెను. గాంధీగారు సబర్మతీ ఆశ్రమమును ముగించి, 1935 సంవత్సరమునందు ఏప్రియల్ నెలలో వార్ధాదగ్గర సేవాగ్రాంగ్రామములో గాంధీగారు ఆశ్రమమును స్థాపించిరి. తక్షణమే కస్తూరిబాయి సబర్మతిలో వలెనే ఇక్కడకూడ సేవ చేయుటకు సిద్ధపడెను. ఆమెనుగురించి ఎక్కువగా తెలియక పోయినప్పటికిని, ఎక్కువగా వ్రాయబడక పోయినప్పటికిని, ఆమె సేవాభాగ్యమువల్లనే, ఆశ్రమమున ఆశ్రమస్తులు శాంతిఫలమును, ఆనందఫలమును ననుభవించు చుండిరి. ఆమె త్యాగము, ఓర్పు, ఆదరణ, వర్ణనాతీతములు, హిందూదేశ స్త్రీలకు నుండతగిన సౌశీల్యాది లక్షణములన్నియు ఆమెయొద్ద నమరియున్నవి. ఇంతయేల ? మహాత్ముని కార్యక్రమములలో అయమశాంతముగా పాల్గొనుటచే సరియగు భాగస్వామియై సంఘమునకు అనల్పసేవయే చేసినదాయెను.

ఆమె తెల్లనివస్త్రములు ధరించి ఆశ్రమమునందొకచోట కూర్చుండి,వచ్చుచు పోవుచుండువారల కష్టసుఖములు విచారించుచు,ఆదరణచేయుచు గృహరాణి హోదాలోనున్న ఆమె మూర్తినిచూచినవారిదే భాగ్యము.

1939 సంవత్సరములో రాజకోటలో అల్లరి జరిగెను. అప్పుడు కస్తూరిబాయి చాల బలహీనముగా నుండెను. ఐనను ఆమెకూడ అందులో పాల్గొనెను. అచ్చటి అధికారులచే ఏవిధమైన విచారణ లేకయే, ఇంకను ఇతర స్త్రీలతో కలిపి ఖైదులో పెట్టబడెను. ఈ విషయమై గాంధీగారు హరిజన పత్రికయం దిట్లు వ్రాసిరి. "ఆమె సత్యాగ్రహ సమరములో కలియునని నాకు తెలియదు. ఆమె విద్యావతి కాకపోయినను కొన్ని సంవత్సరములుగా ఆమెకు స్వేచ్ఛగలదు. ఆమె యిష్టము వచ్చినట్లు చేయుటకు ఆమెకు అధికారముకలదు. దక్షిణాఫ్రికాలోగాని, హిందూదేశములోగాని, ఆమె సంకల్పమువల్లనే ఆమె సత్యాగ్రహములో దూకెను. మీరాబెన్‌ను ఖైదుచేసి నప్పుడు కస్తూరీబాయి తన్నుతాను నాపుకొనజాలక తానును, ప్రవేశించుటకు నన్నడిగెను. ఆమె నిస్సారముగానున్నదని చెప్పితిని.

అంతకుముందే ఢిల్లీలో స్నానాలగదిలో ఆమె ఒడలు తెలియక పడిపోయెను. ఆసమయమునకు దేవదాస్‌గాంధీ లేనచో ఆమె మరణించియే యుండును. ఇదంతయు లెక్క చేయుటలేదని ఆమె పలికెను. తరువాత ఈవిషయమే సర్దారుతో చెప్పితిని. ఆయనయు వినలేదు. ఈ సమయమున ఆయన

హృదయము కరిగెను. రెసిడెంటుచే ప్రోత్సహింపబడి, ఠాకూర్ సాహెబు తనమాట తప్పెను. అందులకై నేను దుఃఖించుట సర్దారు గమనించెను. కస్తూరిబాయి రాజకోట వారి ఆడపడుచు. రాజకోటలోని స్త్రీపురుషులు స్వతంత్రము లేక, బాధపడుచుండుట ఆమె సహించలేకపోయెను.

"తాను సత్యాగ్రహములో దూకుట తన విధియని తలం చెను. కస్తూరిబాయిని సత్యాగ్రహములో దింపుటకు నేనే కారణమని అనేకులు చేయు విమర్శనలు నిజమైనవి కావు. హృదయమునందు బలమున్నచో దుర్బల శరీరులైనను వృద్ధులైనను ఇట్టి సత్యాగ్రహపోరాటములో పాల్గొనవచ్చును"

## రాజకోటలో గాంధీగారి యుపవాస దీక్ష

రాజకోటలో గాంధిజీ మరణపర్యంతము నుపవాసమని దీక్షవూని నప్పుడు కస్తూరీబాయి అప్పటి కింకను జైలులోనే యుండెను. ఆయన దీక్షను గురించి ఆమెకు తెలియజేయబడెను. ఆమె ఆ విషయమై తనతో సలహా చేయలేదని విచారపడి అసంతృప్తి పాలయ్యెను. అందులకు గాంధీగారిట్లు ప్రత్యుత్తర మిచ్చిరి. "నీవు అనవసరముగా బాధపడుచున్నావు. ఆయన సేవచేయుటకు నాకు ఒక అవకాశము పరమేశ్వరుడు కలిగించి నందులకు నీవు సంతోషించవలసినదే. ఇట్లు జరుగునని నాకే తెలియనప్పుడు నీతోగాని ఇతరులతోగాని సంప్రదించగల వ్యవధి ఎక్కడ?

భగవంతుని ఆదేశము వచ్చెను, దానిని శిరసావహించుట గాక నేనేమి చేయగలను? పరమేశ్వరుని దగ్గరనుండి తుదిన ర్త

మాసము రానున్నపుడు దేనినైనను అపుటకుగాని, ఏదైనను సలహాచేయుటకుగాని వీలుండునా ? గాంధీగా రుపవాసదీక్షలో ఆయన దగ్గరనుండుటకు, కస్తూరిబాయి కష్టమున్నచో రాజకోట అధికారులను, ఆమె విడుదల విషయమై రాజకోట వారితో సంప్రదింపులు జరుపుటకై ఆమెకు వ్రాయగా ఆమె ఇట్లని ప్రత్యుత్తరమిచ్చెను. "అట్లు ఏమియు చేయనక్కరలేదు. ప్రతిరోజు వారి విషయమై సమాచారములు తెలియుచున్నచో చాలును. వారిదివరకు పడినకష్టములనుండి ఏ భగవంతుడు ఉద్ధరించెనో ఆ భగవంతుడే ఇప్పుడుకూడ ఉద్ధరింపగలడు. ఐనను మాటిమాటికినియెవరైనను యిట్టిదీక్షలు పూనుదురా;" ఈ వాక్యములు విని గాంధీగారు ఇట్లనిరి. అవును. అట్లు జరగవచ్చును. కాని శుద్ధమైన ఉపవాసము అనగా ఒక మంచికార్యమునకై చేయబడు ఉపవాసదీక్ష దాని ఫలమును బట్టి చర్చింపరాదు. చేసినపని సంతోషముతోడను, భగవదర్పణ బుద్ధి తోడను చేయబడినదా లేదా యనియే ఆలోచింపవలయును. ఇట్టి పవిత్రకార్యములలో తన స్వధర్మ నిర్వాహణములో, మరణము వచ్చినను ఆహ్వానింప వలసినదే."

గీతాశాస్త్రమున మూడవ అధ్యాయమున, శ్రీకృష్ణ పరమాత్మ ఇట్లే చెప్పియుండలేదా? "స్వధర్మే నిధనం శ్రేయః" స్వధర్మమున చచ్చుటయే మేలు.

శారదాదేవియు, లోపలి శత్రువులతో పోట్లాడి వాటిని జయించి చిత్తమును కాళికాదేవియందు స్థిరపరచి, పతి భక్తి చేయుచు వైరాగ్యధురీణయై, భక్తియోగమున సుప్ర

శిక్షితురాలయ్యెను. కస్తూరిబాయి ఇంద్రియ నిగ్రహము కలిగి, పతి బాటయందే తానును నడచుచు, కర్మయోగమున ధీరురాలయ్యెను. గాంధీగారుపవాసదీక్ష నుపసంహరించిరి. ఒక గంట ఐనది. అంతలో రాజకోట అధికారులు కస్తూరిబాయిని, ఇతర రాజకీయ ఖైదీలను విడుదలచేసిరి

## కడపటి ఖైదు

1942 వ సంవత్సరమున, ఆగస్టుతొమ్మిదవ తేదీనాడు నెలలో సాయంకాలమున బొంబాయిలో కస్తూరిబాయిని ఖైదులో పెట్టిరి. ఆరోజు ప్రజలందరు జ్ఞాపకముంచుకొనవలసినదే. స్వతంత్ర పోరాటములో అది ముఖ్యమైన దినము. ఆనాటి ఉదయమున కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమువారును, గాంధీజీయును, దేశమునందక్కడక్కడగల కాంగ్రెసు నాయకులును, హిందూదేశరక్షణచట్టముక్రింద ఖైదుచేయబడిరి.

గాంధీగారివలెనే కస్తూరిబాయియు బిర్లాగారి భవనమునందే యుండెను. ఆనాటి సాయంత్రమే గాంధీగారు శివాజీ పార్కునందు ఉపన్యసింపవలసియుండెను. అంతలో గాంధీగారు ఖైదుచేయబడిరి. ఆయన స్థానములో కస్తూరిబాయి ఉపన్యసించుటకు సిద్ధపడెను. ఇరువురు పోలీసు ఉద్యోగులు వచ్చి ఆమె నిర్ధారణను తెలిసికొని ఆమెను, ఆమెతోనున్న ప్యారీలాలుగారిని, డాక్టరు సుశీలానాయరుగారిని ఖైదు చేసిరి. అందరును పూనాలోనున్న ఆగాఖాను భవనమునకు తీసు

కొని పోబడిరి. గాంధీగారినికూడ అంతకుముందు అక్కడకే తీసుకొనిపోయిరి.

ఆమె ఖైదుచేయబడిన తరువాత 1943 వ సంవత్సరం మార్చి 19 వ తేదీని బొంబాయిగవర్నమెంటువారు ఆమె వ్యాధిని గురించి, ప్రజలకు ఇట్లు తెలియజేసిరి. "ఈ వారంలో రెండు పర్యాయములు హృదయములో 'దెబ్బలు' తగిలెను, ఆ నిస్సారములోనుండి ఆమె కోలుకొనియును ఆ వయస్సులో అట్లుండుట సహజమే.

డాక్టరు గిల్డరుగారును, యల్. యల్. కర్నల్ B. Z. షాగారును ఆమెకు వైద్యము చేయుచుండిరి. మరల డిశంబరు నాల్గవ తేదీని, గవర్నమెంటువారు ఆమె ఆరోగ్యమును గురించి తెలుపుచు ఆవారములో రెండుపర్యాయములు హృదయము నిస్సారమయ్యెననియు, ఆమె ఆ దెబ్బలనుండి కుదుటబడెననియు చెప్పిరి. ఇంకను ఆమె గుండె నిస్సారముగనే యుండెను.

ఆయమ కోరికపై ఆమె కుమారులను మనుమలను దగ్గరకు వచ్చుటకు గవర్నమెంటువారు అనుమతి నొసంగిరి. రోజులు గడచుచుండెను, వ్యాధి హెచ్చగుచుండెను, ఆమెను విడుదల చేయవలసినదిగా గవర్నమెంటువారికి ఒత్తిడివచ్చెను.

డిశంబరు 15 వ తేదీనుండి లండనులో లార్డులసభలో లార్డుస్ట్రాబోల్జి ఇండియా గవర్నమెంటువారు కస్తూరిబాయిని విడుదల చేయుదురా? యని ప్రశ్నించెను. అరల్ ఆఫ్ మున్ స్టర్

హిందూదేశపు క్రింది కార్యదర్శి ఈక్రిందివిధమున ప్రత్యుత్తర మిచ్చెను.

కొంతకాలము క్రిందట ఆరోగ్యము సరిలేనందున ఆమెను విడుదల చేయుటకై గవర్నమెంటువారు తలచిరి. ఇప్పటికిని వారదే యుద్దేశ్యములో నున్నారు. కాని ఆయమను ఖైదులో నుంచుటయే ఆమెకు శ్రేయస్కరమని గవర్నమెంటువారు తలచిరి. అందువలన విడుదల చేయలేదు. ఆమెకు మందిచ్చుటకై గుండె పరిశోధకులలో గొప్పవారిని ఏర్పాటుచేసిరి. వారక్కడనే నివసించుచు ఏ సమయము నందైనను ఆమె వ్యాధిని పరీక్షించగలరు."

మరుసటినాడు కామన్సు సభలో, సోరెన్సనుదొర, అనారోగ్య కారణమున ఆమెను విడుదలచేయుటకు వీలులేదా యని ప్రశ్నింప, అందులకు సెక్రటరి ఆఫ్ స్టేటు, అమెరి దొర గారు ఇదివరకు ఇచ్చిన ప్రత్యుత్తరమునే మరల యిచ్చెను. మరల సోరెన్‌సన్ దొర యిట్లనెను. "అట్లయినచో ఆమె క్లిష్టమైనపుడు కారాగారమును వదలిపెట్టుటకు ఆమెకు అధికారముకలదా ?" అందులకు అమెరి దొరగారు ఇట్లనెను. "ఆమె విడుదల విషయమై ఆలోచించబడెను. బంధువులను చూచుటకు అనుజ్ఞ ఈయబడెను. మందిచ్చు వైద్యులు ఆమె అక్కడనుండుటయే ఆమెకు క్షేమమని తెలిపిరి. సోరెంసన్-ఆమెకు చేయవలసిన సౌకర్యములు చేయుచున్నారు, బాగుగనేయున్నది. కాని, వైద్యులుగాని, ఆమెగాని

ఆమె స్వేచ్ఛను కోరుదురా? వదలిపెట్టుదురా?" ఆమెరీ- ఆ విషయమై ఇండియా ప్రభుత్వము వారికి వదలివేసితిని.

పాఠక మహాశయులారా ! ప్రభుత్వము వారియుత్తరువులు చూచితిరా ? ఇట్టి జవాబుదారీ రాహిత్యమగు ప్రభుత్వమున ఎన్నాళ్ళుండగలము ? మనలో మనకు ఐక్యత యున్నచో తెల్లదొరలు ఇన్నినాళ్ళు మనలను అణచియుంచ గలరా? పరిపాలన న్యాయముగా యున్నచో ఏ ప్రభుత్వమైనను మనకొకటియే. ఇప్పటికైనను మించిపోయినది లేదు. మనలో గల శక్తులను ఒకటిగా చేసి. గాంధిగారు చెప్పినట్లు వినినచో ఏల స్వారాజ్యము రాదు? 19.3 సంవత్సరము డిశంబరు 29 తేదీన బొంబాయి ప్రభుత్వము వారు కస్తూరిబాయికి గుంకను గుండె దెబ్బలు వచ్చుచున్నవనియు, ఆమెకు వృద్ధాప్యమువల్లను, నీరసమువల్లను, ప్రమాదము కలుగవచ్చునను భయముకలదనియు వెల్లడించిరి, డిశంబరు 24వ తేదీని ప్రభుత్వము వారు ప్రజలకు వెల్లడిచేసిరి. "కస్తూరిబాయికి, అనారోగ్యముగా నున్నందు వలన, ప్రభుత్వము వారు ఆమెను వరుసగా జెయిలులోనుంచుటను గూర్చి ప్రజలిచ్చుచున్న అభిప్రాయములను ప్రభుత్వము వారు గమనించుచునేయున్నారు. ఆమెనువిడుదలచేయుచో, ఆమెగాంధీగారికి మార్గమగును, ఆమె బంధువులను చూడగల వీలును కలుగదు. ఇప్పుడు వైద్యచికిత్సయు చక్కగా జరుగుచున్నది."

ఆమెను వదలిపెట్టినచో ఆమెయందుగాని, ఆమె బంధువులయందుగాని ప్రభుత్వము వారు దయచూపినట్లుకాదు. ఆమె అగాఖాన్ భవనములో నుండుటయే శ్రేయస్కరము. 1944

సంవత్సరము జాన్యువరి 4 గవ తేదీని దేవదాస్‌గాంధి తమ తల్లిని చూచియుండెను. తన సోదరుడగు మణిలాల్ గాంధీకి సర్ బాన్ పట్టణమునకు యిట్లు టెలిగ్రామ్ ఇచ్చెను. "అమ్మగారు చాల ప్రమాద స్థితిలోనున్నది. వైద్యచికిత్స తృప్తికరముగా లేదు" ఫిబ్రవరి 1 వ తేదీన బొంబాయి ప్రభుత్వమువారు కస్తూరిబాయి చాల ప్రమాదస్థితిలో నున్నదనియు, చాల నిస్సారముగానున్నదనియు ప్రకటించిరి.

ఇంతవరకు ప్రభుత్వమువారి విషయ మిట్లున్నది. ఆమెకు ప్రేమాస్పదుడును, మనకు దగ్గరవాడు నగు దేవదాసుగాంధి ఫిబ్రవరి 18 వ తేది ఇట్లు చెప్పియున్నాడు "1943 వ సంవత్సరము సెప్టెంబరు మాసము మొదలు నిర్బంధస్థలములో ఆమెకు రోగము ప్రారంభమయ్యెను. అపుడే ప్రథమపర్యాయము గుండెదోషము చూడబడినది. అంతకుముందు నాలు గయిదు సంవత్సరములు అనారోగ్యముగానున్నను ఈ గుండెదోషము కానిపించలేదు. ఇప్పుడు యీ దోషము కనపడిన వెనుక మరి కస్తూరిబాయి కోలుకొనలేదు. శారీరకముగాగాని, మానసికముగాగాని ఆయమ నిర్బంధమును సహించలేదనుటలో నే మాత్రమును అతిశయోక్తిలేదు.

ఇదివరకు అనేక పర్యాయములు ఆయమ కారాగార నివాసము ననుభవించెను. రాజకోట లోని ఒక గ్రామములో ఆమె బంధింపబడెను. అపుడు కూడ ప్రమాదస్థితి నొందియుండెను.

అయినను ఇది కడపటి పర్యాయమో యనునట్లు మహాకష్టము నొందుటచే ఆమె దేహములన్నియు శిథిలము

లయ్యెను. ఇచ్చటి వాతావరణము ఆమెకు రుచించలేదు. పెద్ద పెద్ద బంగాళాలు, చుట్టు ఇనుపతీగెలు, కాపలాకాయు బంట్రోతులు, ఈ పరిసరములకన్న సేవాగ్రాము గ్రామములోని కుటీరమే ఆమె రుచికరమని చెప్పియుండినది. ఇన్నినాళ్ళు అని నియమము లేని నిర్బంధము ఆమెకు చాల బాధాకర మయ్యెను.

ఇంత కాలమని చెప్పక, ఆమెను నిర్బంధములో నుంచిన విషయమే గాక, ఇంకను వేలకొలది ఇతరులను, తనకు తెలిసిన వారిని కూడ ప్రభుత్వమువారు బాధించుట ఆమెకు చాల బాధాకర మయ్యెను.

తానును తన భర్తయును ఎన్ని సంవత్సరములు స్థిరముగా జైలులో నుంచబడినను ఆమెకు ఇష్టమే ఇతరులు మాత్రము విడుదల చేయబడినచో ఆమెకు సంతోషము. ఇందులకై ఆమె నిరంతరము దైవధ్యానము చేయుచుండెను. ఉదార చరితుల హృదయములు, ఇట్లే యుండును. బుద్ధిమంతులు తాము ఎట్టిబాధల నయినను సహింతురు. ఇతరుల బాధలను చూచి భరించలేరు.

కస్తూరిబాయికి కొంతవరకైనను స్వేచ్ఛనిచ్చియున్నచో ఆమెకెంతో హాయిగా నుండెడిది. ఆమెరోగము కూడ శమించెడిది.

ఫిబ్రవరి 8 వతేది కస్తూరిబాయిని విడిపించుటకు చివర ప్రయత్నము చేయబడెను. ప్రభుత్వమువారి ప్రత్యుత్తరము మామూలు ధోరణిలో నుండెనేగాని అనుకూలము గాలేదు.

ఫిబ్రవరి 20 వ తేది బొంబాయి ప్రభుత్వమువారు ఇట్లు తెలియ పరచిరి.

"కస్తూరిబాయి శరీరపరిస్థితి కొద్దిరోజులుగా బొత్తిగా బాగుండలేదు. ఇప్పుడు మిక్కిలి ప్రమాదస్థితిలోనున్నది. పెనిసిలిన్ అను మందుకొరకు విమానముపై కలకత్తాకు ఒకరిని పంపించిరి. ఆ మందు కలకత్తానుండి పూనాకు రావలయును"

## అంత్య దశ

కస్తూరిబాయియొక్క చివరిదశనుగూర్చి ఫిబ్రవరి 21వ తేది దేవదాసు ఇట్లు చెప్పియున్నాడు. "ఆమె చివర నిముసము వరకు పూర్తిగా తెలివి తప్పియుండలేదు. రక్తపు దోషము తగ్గెను. వైద్యులకు ఆమె జీవించునను ఆశ లేదు. ఆ రాత్రి ఎట్లో గడచెను. ఆమె స్నేహితురాండ్రు, పరిచారికలు, గాంధి మొదలైనవారు ప్రతిక్షణమును ఆమెను కనిపెట్టుకొనియే యుండిరి. వారడుగు ప్రశ్నలకు ఆమె అస్పష్టముగా సమాధానములు చెప్పుచుండెను.

ఒక్కొక్కప్పుడు నెమ్మదిగా తల ఆడించు నెపమున ప్రత్యుత్తరమిచ్చును. ఒకపర్యాయము గాంధీగారు దగ్గరనున్నప్పుడు 'వా రెవర'ని ఆమె ప్రశ్నించెను. గాంధీగారని తెలిసిన వెంటనే ఆమెకు ఓదార్పు గలిగెను. ఆమె ప్రక్క గాంధీగారు తక్కువ వయస్సు గలవానివలె నుండెను. సోమవారము మొదలు ఆమె ఔషధము తీసుకొనుటగాని, నీరు త్రాగుట గాని మానెను. మంగళవారం మధ్యాహ్నము రెండుచుక్కలు

గంగానదీజలము త్రాగెను. దాన, కొంచెము సంతృప్తి నొందెను. సాయంకాలం మూడుగంట లయ్యెను. ఆమె నా కొరకై కబురుచేసెను. నేను దగ్గరకు వెళ్ళియుంటిని. ఆమె ఇట్లనెను. "ఏదో ఒకనాడు నేను పోవలసిదే! నేడే యేల పోకూడదు?" నేనే ఆమెను పట్టుకొంటిని.

ఆమె ఏమేమో ప్రేమరసములుకు పలుకులను పలికెను ఆ పలుకులు ఎంతో మధురములై యుండెను. అంతలోనే తన రెండుచేతులను కలిపి ఒకరి సహాయములేకయే కూర్చుండెను. శిరస్సువంచెను. ఉన్న గొంతుకను ఉపయోగించి కొన్ని నిముసములు ప్రార్థించెను "ఓపరమేశ్వరా! నిన్నే శరణంటిని. నీకటాక్షమునేకోరుచున్నాను" ఇట్లు మాటిమాటికిధ్యానించెను. నాకన్నీళ్ళుతుడుచుకొనుటకై గదిలోనుండిబయటకువచ్చియుంటిని. కలకత్తానుండి ఔషధము విమానములో వచ్చియుండెను. సాయంకాల మయిదుగంటలయ్యెను. నేను ధైర్యము తెచ్చుకొని మా అమ్మను చూచితిని. ఆమె చిరునవ్వు నవ్వెను. వైద్యులు మందిచ్చుటకు సిద్ధముగానుండిరి. కాని నిరుపయోగమని నిర్ధరించిరి. గాంధీగా రీ విషయమును తెలిసికొని తన కుమారునితో నిట్లనిరి. "ఎంత గొప్పమందులు వచ్చినను ఇప్పుడు మీ అమ్మను బ్రతికించలేవు. నీవు గట్టిగా మందిప్పించెద నన్నచో నేను కాదనను. కాని నీవు పొరపాటు పడుచున్నావు. రెండు రోజులుగా ఆమె మందు, నీరు, మాని వేసెను. ఇప్పు డామె భగవంతుని చేతులలో ఉన్నది.

ఇప్పుడు ఇంజెక్షనులిచ్చి, ఆమె నేల మరింత బాధ పెట్టెదవు" అంతట వైద్యులు మందు ఎక్కించు విషయమై ఉపసంహారించుకొనిరి. ఆ సమయమునందచ్చట గాంధీగారును వారి ఇద్దరు కుమాళ్ళు హీరాలాల్, దేవదాసు, డాక్టరు సుశీలానాయర్, మిస్టరు ప్యారీలాల్, జయప్రకాశ నారాయణుని భార్య ప్రభావతీదేవియు, డాక్టరు గిల్డర్, కనూగాంధీ, ఆనందస్వామి ఆ గదిలోనుండిరి. ఇంకను కొందరు బంధువులు గలరు. అంతలో కస్తూరీబాయి సోదరుడగు మాధవదాసుగోకులదాసు వచ్చెను.

అది మహాశివరాత్రి. సాయంకాల మూడుగంటలకు అందరి భోజనము లయ్యెను. అందరును కలసి దైవధ్యాన మొనర్చిరి. ఒక క్షణములో ఆమె శరీరము కొయ్యబారెను. 7 గంటలకు ఆగాఖాన్ భవనములో ఆమె భౌతిక శరీరమును చాలించెనని బొంబాయిగవర్నమెంటువారు విచారపడుచు తెలియ చెప్పిరి. మరునాడుదయము 10-40 గంటలకు దేవదాస్ గాంధి తన మాతృకళేబరముయొక్క దహనక్రియలు గావించెను. గాంధిగారు ఒకక్షణము దుఃఖించిరి. అంతలో ఆయన జ్ఞాననేత్రము తెరువబడెను. తత్క్షణమే పరమశాంతుడయ్యెను. పసుపు కుంకుమలతో దేశసేవ చేసి, పసుపు కుంకుమలతో పరలోకసేవకై నడిచిన, కస్తూరిబాయి అదృష్టవతి కాదా? ఫిబ్రవరి 25వ తేది సంచయనము జరుపబడెను. తదుపరి ఆమె అస్తికలు గంగార్పణము చేయుబడెను. భారతదేశము దుఃఖాశ్రువులు రాల్చెను.

పాఠక మహాశయులారా! శారదాదేవియు చివర వరకు దేశసేవచేసి ఆధ్యాత్మిక మధువనములో, మ దేశమై సంచరించి, స్వానుభవమును ఆర్తులగు సోదరులకు అప్పగించ లేదా? ఆంధ్ర దేశమునందు మంగళగిరి బాలాంబయు, తరిగొండ వేంకమాంబయు, మహర్షి విన్నకోట సుందరమ్మగారును (ఈగ్రంథకర్తమాతృశ్రీ) దేశసేవ చేసి రత్నములై ప్రకాశించి పరలోకము చేరలేదా? కావున నో నారీమణులారా! మీరును కొంత కాలము సంసారసేవయు కంసారిసేవయు-చేయుచున్నను, అమూల్యమగు మిగిలిన కాలము దేశసేవలో వినియోగించి ధన్యులగుడు.

సీ॥ పూర్వభారత దేశమును వెలిగించిరి
సకియలే జ్ఞానదీపికల చేత
పూర్వభారత దేశమునఁ గీర్తిగాంచిరి
సుదతులే భర్తృ శుశ్రూషవలన
పూర్వభారత దేశమున రాజ్యమేలిరి
తరుణులే ధర్మయుద్ధములొనర్చి
పూర్వభారత దేశమున పేరుబడసిరి
లలనలే యుషనిష త్తుల రచించి
గీ॥ గాన మీరును, మీరును, చానలార?
బాల్యమున మంచిగ్రంథముల్ పఠనచేసి
కాంతలై దేశసేవల కాంతిమీరి
జీవితమ్ములు ధన్యముల్ చేసికొనరె?

స్వాములవార్ల పాదములపై రూపాయలుపోసి, వారి సేవచేసి, వారిచే చెవిలో మహావాక్యములు చెప్పించుకొని, అవి వల్లనవేసి, మఱలమీాను గురువులై శిష్యులను చేర్చుకొని, వెనుకటిఖుర్చులు నాల్గురెట్లు సంపాదించగనే, ముక్తిగలుగునని భ్రమపడకూడదు.

ఒక బ్రాహ్మణ కుటుంబ మున్నదనుకొనుడు. ఆ యజమాని పేరు దిబ్బశాస్త్రి వయస్సు 70 సం॥ ఆయన భార్యపేరు లచ్చమ్మ వయస్సు 40 సం॥ భర్తను లక్ష్యము చేయదు. వేదాంతము తెలుసును. ఒక గురువనే శిష్యురాలు ఆమెకు సంఘటనం గలిగింది. గురువురాగనే తలంట్లు, పాదపూజలు, పిండివంటలు, ఆ పాదమస్తకం సేవలు, ఏకాంతగోష్ఠులు (సాటిశిష్య వరమాణువులతో) జరుపుచుండును. మొగుడు పెద్దవాడైనాసరే, ముష్టియెత్తి తెస్తేనేగాని అన్నంబెట్టదు. తిట్టును. అసహ్యించుకొనును. ఆయన పాపం కాలువలో స్నానంచేస్తూ తన సంగతి చెప్పుకొంటూ ఏడుస్తూ యుంటాడు గురువుసుఖం గురువుదేగాని "మొగుణ్ణి జాగ్రతగా చూడు" అంటే గురువునే దగ్గఱకు రానివ్వదు గురువుకు పెండ్లాం ఉన్నది. కాని శిష్యురాలిని చూడ ది ఆయన యుండలేదు. వీరి ముగ్గురికేగాదు ఆ కోటిలో చేరినవారందఱికి వేదాంతం కంఠతా వర్ణించటం తెలుసు. అయితే చూడండి ఏంలాభం – శ్రీ రామకృష్ణుడు – శారదాదేవి – భార్యాభర్తలు కారా? ఒకరి నొకరు గౌరవించుకోలేదు? సేవించుకోలేదు వారిలాగ యుండక, వారి

బోధలు వినక, ఇష్టం వచ్చినట్లు ఉంటే మోక్షం దొరకు తుందా? అధోగతియే కలుగును, సంపూర్ణ ఆత్మసామ్రాజ్యము నేలదలచిన వారు ముందు కట్టుబాట్లలో మెలంగవలయును. ఆ కట్టుబాట్లలో ముఖ్యమైనది. పేరుగాని, ప్రతిష్ఠగాని, కోరని దేశసేవ. దానినేచేసి శారదాదేవి - కస్తూరిబాయి ధన్యురాండ్రైరి.

గీ॥ తీయనైన పథంబు దేశసేవ !
దృష్టి సఫలతనొందు శ్రీ దేశసేవ
వాసిగాంచిన దన్నింట దేశసేవ
దేవ! ముక్తికి త్రోవయే దేవసేవ.

ఇది సకల శాస్త్రములయందును, అన్నికాలముల యందును, పెద్దల జీవితములయందును కానవగును.

జాతీ ప్రెస్, బెజవాడ. 157/18-2-47—1000

# గీతాప్రచురణాలయమువారి ప్రచురణములు

గ్రంథకర్త : విన్నకోట వేంకటరత్నశర్మ

| | |
|---|---|
| భగవద్గీత – బైబిలు – కొరాను (3వ ముద్రణ) | 10–0 0 |
| అష్టోత్తర శతశ్లోకిగీత | 2–0. |
| గోవిందనామాలగీత (పాట 18 అధ్యాయాలు) | 1–0–0 |
| సహస్రోపనిషత్ సారము (1వ భాగము) | 3–0–0 |
| రామకృష్ణ వివేకానంద (నాటకము) | 1–8–0 |
| శారదాదేవి – కస్తూరిబాయి | 1–0–0 |
| నూతన సంవత్సరాదికానుక | 0–2–0 |
| రమణమహర్షితో సంభాషణము | 0–2–0 |
| భక్తిసోపానము (లం. భా. దేవి కృతము) | 3–0–0 |

దుర్గా అగ్రహారము, బెజవాడ